# శ్రీ సత్యనారాయణ స్వామి సమగ్ర వ్రత కల్పము

## సస్వరమన్త్ర సహితము

## (తొమ్మిది అధ్యాయముల కథ)



సఙ్కలయిత

బ్రహ్మశ్రీ ముట్నూరి దుర్గానాగేశ్వర శాస్త్రి

# పరిచయము



(బ్రహ్మశ్రీ ముట్నూరి దుర్గానాగేశ్వర శాస్త్రి , విజయలక్ష్మి దంపతులు)

బ్రహ్మశ్రీ ముట్నూరి దుర్గానాగేశ్వర శాస్త్రి గారు క్రీ.శ. 1944 లో ఆంధ్రప్రదేశ్, కృష్ణాజిల్లా, కోడూరులో బ్రహ్మశ్రీ ముట్నూరి రామయ్యగారు, కనకదుర్గ దంపతులకు ప్రథమ సంతానముగా జన్మించినారు. సుప్రసిద్ధ స్మార్తవిద్యా విశారదులు, శిష్య ప్రశిష్య కీర్తిమంతులైన (కీ.శే.) బ్రహ్మశ్రీ కవితా శేషయ్య (అవనిగడ్డ) గారి శిష్యరికములో స్మార్తవిద్య, ధర్మశాస్త్ర విశేములు గురుకుల పద్ధతిలో క్షుణ్ణముగా అభ్యసించినారు. పూర్వాపర స్మార్తవిద్యా నిష్ణాతులు. వైదికాచార నిష్ఠాతత్పరులు. దీక్షాపరులు. పరదేవతోపాసకులు. శిష్యప్రసిద్ధి నొంది ప్రస్తుతము మచిలీపట్టణము నందు మార్గనిర్దేశకులై విశ్రాంతజీవనమును గడుపుచున్నారు.



గ్రంథకర్త గురుదేవులు బ్రహ్మశ్రీ కవితా శేషయ్య గారు
స్మార్త, ధర్మశాస్త్ర నిష్ణాతులు



గ్రంథకర్త శ్వశురులు, వేద స్మార్త పండితులు,
బ్రహ్మశ్రీ కవితా ఆంజనేయశాస్త్రి గారు

# శ్రీ సత్యనారాయణ స్వామి సమగ్ర వ్రత కల్పము

సస్వరమన్త్ర సహితము

(తొమ్మిది అధ్యాయముల కథ)



సఙ్కలయిత

బ్రహ్మశ్రీ ముట్నూరి దుర్గానాగేశ్వర శాస్త్రి

SREE SATYANARAYANA SWAMY
SAMAGRA VRATAKALPAM

శ్రీ సత్యనారాయణస్వామి సమగ్ర వ్రతకల్పము



ప్రథమ ముద్రణ :: జూన్ 2017
ప్రతులు : 1000

వెల : రూ. 120 /-



గ్రంథ ప్రాప్తి స్థానము :
ముట్నూరి శ్రీనివాస్
డోర్ నెం. 23/151, బ్రాహ్మణ అగ్రహారము
రామానాయుడు పేట
మచిలీపట్నము - 521001

ముద్రణ :: **Sri Uday Printers**,
3-5-170/8/1/A, YMCA
Narayana Guda, Hyderabad.
Ph. 040-64511385

"వాస్తు జ్యోతిష విద్వాన్"

"దైవజ్ఞ రత్న"

(కీ.శే.) బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ



(క్రీ.శ. 26.06.1916 - 19.01.1990)
గారి శతజయంతి సంస్మరణ పూర్వకముగా
వెలువరించబడినది.

కవితావంశ సంభూతం దైవజ్ఞలోక మకుటమ్
స్కన్ధత్రయ విశారదం వాస్తుశాస్త్ర విభాకరమ్
బ్రాహ్మీమయం తపోనిధిం మహర్షిం శిష్యవత్సలమ్
ప్రణమామి గురుం సదా త్వాం కామేశ్వర శర్మాణమ్

# ముందుమాట

## శ్రీ గురుభ్యో నమః
## శ్రీ సత్యనారాయణస్వామినే నమః

కలియుగమునందు శ్రీసత్యనారాయణస్వామి వ్రతము అనేకానేక శుభఫలముల నిచ్చునని, కోర్కెలను తీర్చునని పురాణములలో చెప్పబడినది. అనాదిగా శ్రీ సత్యనారాయణస్వామివారి వ్రతమును భక్తులు అనేకానేక సందర్భములలో స్వామివారి అనుగ్రహమును పొందుటకై ఆచరించేడము ఒక సాంప్రదాయికముగా నున్నది. స్వల్పమైన తేడాలు ఉన్నప్పటికీ, వ్రత విధానము ఇంచుమించు ఒకే విధముగానే ఉంటుంది. వైదిక లేదా పౌరాణిక విధానములలో విహితమైన విధిని ఈ వ్రతాచరణము స్వామివారి అనుగ్రహమును, మనోవాంఛితములను సంపూర్ణముగా నొసంగుననుటకు సందేహమే అక్కరలేదు. శక్తికి పరిమితులున్ననూ, భక్తికి లేవు కదా! నిరాడంబరమైన, పరిపూర్ణమైన భక్తిప్రపత్తులే వ్రతాచరణములో ప్రధానము, విధానము.

ఈ వ్రతవిధానము సెఱుకపఱచు గ్రంథము లలభ్యములు కాకున్నప్పటికీ, స్వర సహిత మన్త్రము, స్ఖలితరహిత పద, శ్లోక సహితముగా నొక నిర్దుష్ట స్వయంబోధిని వంటి గ్రంథము యున్నచో సౌలభ్యముగా నుండుననిన అనేకాభిలాషుల కోరికను స్వామి సఙ్కల్పముగా శిరసావహించి ఈ గ్రంథమును కూర్చడమైనది.  అంతియే కాని యిదియే సప్రమాణమని మాత్రము కాదు. శ్లోక మన్త్రోచ్చారణములు చేయునపుడు స్వర, శబ్దస్వరూప, అర్థ, జ్ఞానమును కలిగియుండుట అత్యావశ్యకము. "అర్థము", "అర్ధము"లకు కల భేదమును తెలియకున్నచో నది యనర్థదాయకమగును. ప్రయత్నలోపము లేనప్పటికీ దోషములు దొరలిన సందర్భములు క్షంతవ్యము. "ప్రమాదో ధీమతామపి" అన్న లోకోక్తికి ఎవ్వరునూ అతీతులు కారు కదా!

భక్తశిఖామణులకు వ్రతాచరణములో ఈ పొత్తము మార్గదర్శకమై, వారు శ్రీ రమా సహిత సత్యనారాయణస్వామి వారి సంపూర్ణానుగ్రహలబ్ధులై, కల్పోక్త మనోవాంఛితములను పొందవలయునని శ్రీసత్యనారాయణస్వామి వారికి మదీయ భక్తిపూర్వక విన్నపము.

మచిలీపట్టణము — బుధజన విధేయుడు

29.03.2017 — **ముట్నూరి దుర్గానాగేశ్వరశాస్త్రి**

## వ్రతోపక్రమణము

శ్రీ సత్యనారాయణస్వామి వారి వ్రతాచరణమునకు మనస్సున సంకల్పించిన క్షణమే సుముహూర్తము. అయిననూ విశిష్టముగా సంక్రాంతి, పౌర్ణమి, ఏకాదశి తిథులలో ఏదోఒక దినమున సాయంకాలమందున లేదా పగలు మొదటిజామున, వర్జ్య దుర్ముహూర్తములు లేని సమయమున, యజమాని భార్యాసమేతముగా మంగళస్నానమును చేసి, సన్ధ్యావన్దన నిత్య దైవారాధనాది కార్యములను యథా విధిగా నిర్వర్తించుకొనిన పిమ్మట, బ్రాహ్మణులు, బంధువులు, సువాసినులతోపాటు స్వస్తివాచక, మంగళవాద్య శ్రవణములు చేయుచూ, సముద్రతీరము, పుణ్యనదీ తీరము, పుణ్యక్షేత్రము, వనము లేదా స్వగృహములో శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతమును చేయవలయును. వ్రతమును చేయు స్థలమును శుద్ధిచేయవలయును. తూర్పుదిక్కున ఆవుపేడతో అలికి, రంగురంగుల ముగ్గులు పెట్టవలయును. అరటిచెట్లు, మామిడి ఆకులతో అలంకరించేవలయును. అక్కడ పూజాపీఠమును పెట్టి, పీఠముమధ్యలో అష్టదళ పద్మమును తెల్లని బియ్యపుపిండితో వేయ వలయును. పీఠము మీద అంచుగల రెండు పసుపు పూసిన క్రొత్తవస్త్రములను పరుపవలయును. వస్త్రముపైన ఐదు తూముల (ఇరువది కుంచేములు) లేదా యథాశక్తిగా తెల్లని శుభ్రపరుపబడిన బియ్యమును పోసి చేక్కగా పరుప వలయును. ఆ బియ్యము మీద కలశమును ఉంచుచోట ఓమ్ కారమును ఉచ్చరిస్తూ, "ఓమ్" అని ఉంగరపువ్రేలితో వ్రాయ వలయును. పీఠమునకు నాలుగుదిక్కుల యందున దీపారాధనమును చేయవలయును. పంచలోక పాలకులను, నవగ్రహములను, ఇంద్రాద్యష్టదిక్పాలకులను, బ్రహ్మవిష్ణు మహేశ్వరు లను, దుర్గా, గణపతి, క్షేత్రపాలక, అభయంకర, వాస్తుపురుషాది అంగదేవతలను ఆవాహనము చేసి పూజించేవలయును. పిమ్మట కలశస్థాపనమును (బంగారు, వెండి లేదా రాగి కలశపాత్ర) చేసి, రమాసహిత సత్యనారాయణస్వామి వారిని ప్రతిష్ఠించి విధివిధానముగా భక్తితో శక్తికొలది షోడశోపచార పూజాదులతో, అష్టోత్తరశత, సహస్రనామాద్యర్చనమును చేయవలయును. అనంతరము, స్వామి వారి మహిమలను ప్రకాశపరచు వ్రతకథా శ్రవణమును చేయవలయును. పునః యథోక్తపూజా కార్యక్రమములను నిర్వహించి స్వామివారి ఉద్వాసనమును చేయ వలయును. పూజావిధిని నిర్వర్తింపచేసిన బ్రాహ్మణుని యథోచిత దక్షిణతో కూడిన నూతన వస్త్రాదులతో సంతృప్తిపరచి, మంటపమును దానముగా సమర్పించే వలయును. బంధుమిత్రులందరికీ ప్రసాద వినియోగమును చేసి అందరికీ భోజన సంతర్పణమును చేయవలయును. వేదోక్త లేదా పురాణోక్త విధివిధానముగా భక్తిశ్రద్ధలతో వ్రతమును చేయవలయును.

## వ్రతమునకు కావలసిన ద్రవ్యములు.

1. పసుపు, కుంకుమ
2. శుభ్రపరుపబడిన తెల్లనిబియ్యము
3. తములపాకులు, వక్కలు
4. (ఎండు) ఖర్జూర ఫలములు
5. అరటిపండ్లు–50
6. అగరువత్తులు లేదా సాంబ్రాణి, కర్పూరము
7. ఆవుపాలు, ఆవుపెరుగు, ఆవునేయి, తేనె, పంచేదార, (పంచామృతములకు)
8. నవధాన్యములు (గోదుమలు, బియ్యము, కందులు, మినుములు, శనగలు, నువ్వులు, పెసలు, ఉలవలు, బొబ్బర్లు)
9. అంచుగల అవికెగుడ్డ (ఎరుపు), అంచుగల రెండు తెల్లని అంగవస్త్రములు, అంచుగల ఎర్రని చీర, మరియు పసుపు లేదా తెలుపు పంచె, ఉత్తరీయము
10. సత్యనారాయణస్వామి ప్రతిమ (లేదా పటము)
11. కొబ్బరికాయలు–15
12. అగ్గిపెట్టె
13. పసుపు విఘ్నేశ్వరుడు
14. ప్రత్తివత్తులు
15. ఆవునేయి లేదా నువ్వులనూనె (దీపారాధనమునకు)
16. పూజాపాత్రములు మఱియు దీపారాధన కుందులు, హారతిపాత్ర మొదలగు వస్తువులు
17. అరగదీసిన గంధపుముద్ద లేదా గంధపుపొడిముద్ద
18. కలశమునకు చెంబులు (బంగారము, వెండి, రాగి, కంచు లేదా ఇత్తడి క్రమములో హీనములు. ఇనుప లేదా స్టీలు పాత్ర అధమము, వాడరాదు)
19. ప్రసాదము:– గోదుమరవ్వ, పంచేదార, ఆవునేయి, ఆవుపాలు (ఒక్కొక్కటి 1250 గ్రాములు లేదా 625 గ్రాములు ), ఏలకులు, జీడిపప్పు, కిస్మిస్, ద్రాక్షపండ్లు, బాదముపప్పులు, పటికబెల్లమును, వినియోగించి వండబడినది.
20. చేలిమిడి (నువ్వులు లేకుండా బియ్యపుపిండి, బెల్లము, ఆవునేతితో చేసినది లేదా వండబడినది)
21. వడపప్పు (నీళ్ళలో నాన్చిన పెసరపప్పు లేదా శనగపప్పు)
22. బెల్లపుపానకము (ఏలకుల పొడి, మిరియాలపొడి, చిటికెడు పచ్చేకర్పూరపు పొడి పానకములో కలుపవచ్చును)

23. చిల్లరనాణెములు–60 (10 లేదా 5 రూపాయల నాణెములు)
24. సువాసనగల పూలు, వివిధరంగుల పూలు, తులసీదళములు. తులసీ దళమాల, సువాసన గల పూలమాల
25. పసుపుఅక్షతలు (తడి లేకుండా)
26. గరికపోచేలు
27. లేత మామిడి ఆకుల మండలు
28. పంచపల్లవములు (మేడి, మామిడి, జువ్వి, రావి మరియు మఱ్ఱి వృక్షముల లేత ఆకులు)
29. మధుపర్కము (ఆవుపెరుగు + ఆవు నేయి + తేనె (లేదా బెల్లము)
30. బ్రాహ్మణ దక్షిణ (యథాశక్తి), దోవతుల చాపు

శ్రీ రామాయనమః
శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు
శ్రీ రమాసహిత సత్యనారాయణస్వామి పరబ్రహ్మణేనమః
శ్రీ గురుభ్యోనమః

శ్రీ రమాసహిత సత్యనారాయణస్వామి వారి వ్రతమును చేయువారు గృహమున ఈశాన్యభాగమున గాని, తూర్పుభాగమున గాని గోమయము (ఆవుపేడ) తో అలికి పంచవిధ చూర్ణములతో శంఖ, చక్ర, గదా, పద్మ రంగవల్లులతో అలంకరించి, ఒక మంటపమును ఏర్పాటుచేసి, దానిని పసుపు కుంకుమలతో, అరటి చెట్టు స్తంభములతో, మామిడి ఆకులతోనూ అలంకరించేవలెను. అభ్యంగన స్నానమును చేసి పరిశుభ్ర దేహముతో సంప్రదాయపద్ధతిలో దోవతి మరియు ఉత్తరీయములను ధరించేవలయును. నుదుటిమీద విభూతిని గాని కుంకుమబొట్టును గాని ధరించేవలయును. పూజాద్రవ్యములతో మంటపము వద్దకు చేరవలయును.

వ్రతపీఠమునకు ఎదురుగా (తూర్పు ముఖముగా) ఆసనము మీద దంపతులు కూరుచుండవలెను. ధర్మపత్ని భర్తకు ఎడమప్రక్కన కూర్చుండ వలయును. చేతులను శుభ్రముగా కడుగుకొని పొడిగుడ్డతో తుడుచుకొన వలయును.

## వ్రత ప్రారంభము

*(పౌరాణికవిధి ననుసరించు సందర్భమున, మన్త్రభాగలుప్తముగ, ప్రణవ రహిత ముగ, కేవల శ్లోక, క్రియావాచ్య సహితముగా ఆచరింప శాస్త్రనిర్దేశితము. ''ఓం'' బదులుగా "ఔం", "స్వాహా" బదులు "నమః" గ్రాహ్యము. "వేదమన్త్ర స్వధా స్వాహా వషట్కారాదిభిర్వినా తత్ర నమశ్శబ్దం వాచయేత్" అని విధి వచనము.)*

**మం ॥ ఓం ధ్రువన్తే రాజా వరుణో ధ్రువన్దేవో బృహస్పతిః ।**

**ధ్రువన్త ఇన్ద్రశ్చాగ్నిశ్చ రాష్ట్రం ధారయతాం ధ్రువమ్ ॥**

*(కర్త, ధర్మపత్ని ఇరువురూ దోసిలిలో రెండు అరటిపండ్లు, ఐదు తములపాకులు, సువర్ణము లేదా ఒక నాణెము గల తాంబూలమును పట్టుకుని అసనము మీద*

*కూర్చుండవలయును. తరువాత ఆ తాంబూలములను ఒక పళ్ళెములో ఉంచవలయును. బ్రహ్మగారు, ఇతర కుటుంబ పరివారపు పెద్దలు ఆశీరక్షతలను వేయవలయును)*

**దేవస్య పురతః దీపారాధన జ్కుర్యాత్ ।**

*(పీఠమునకు నాలుగు మూలల యందున లేదా ముందువైపు ఇరుమూలల యందు లేదా కుడిప్రక్క నైరుతి మూలయందున దీపారాధనమును చేయవలయును)*

శ్లో॥ భక్త్యా దీపం ప్రయచ్ఛామి దేవాయ పరమాత్మనే ।
త్రాహిమాం నరకాద్ఘోరా ద్దివ్యజ్యోతి ర్నమోస్తుతే ॥

**మం ॥ ఉద్దీప్యస్వ జాతవేదోపఘ్నం నిరృతిం మమ ।**
**పశూగ్‌శ్చ మహ్యమావహ జీవనఞ్చ దిశోదిశ ॥**

*(వత్తులను వెలిగించిన పిమ్మట, చేతిని కడుగుకొని, దీపపాత్రకు మూడు వైపుల కుంకుమను పెట్టవలయును. దీపపాత్రలో కొంచెము నేయి లేదా తైలమును వేయవలయును)*

రమాసహిత శ్రీసత్యనారాయణస్వామి స్వరూప అఖణ్డజ్యోతి పరబ్రహ్మణే నమః । గన్ధపుష్పాది సర్వోపచార పూజాం సమర్పయామి ।

శ్లో॥ దీపదేవీ మహాదేవీ శుభం భవతు మే సదా ।
యావత్పూజా స్సమాప్తిస్యాత్ భవత్ప్రజ్వల సుస్థిరా ॥

*(పుష్పము, అక్షతలను దీపమునకు సమర్పించి నమస్కరించవలయును)*

శ్లో॥ ఆగమార్థంతు దేవానాం గమనార్థంతు రాక్షసామ్ ।
కురు ఘణ్టారవం తత్ర దేవతాఽహ్వాన లాఞ్ఛనమ్ ॥

*(గట్టిగా శబ్దము చేయునటుల గంటను మ్రోగించవలయును)*

శ్లో॥ శబ్దబ్రహ్మాత్మకం దైవం శబ్దబ్రహ్మాత్మకం జగత్ ।
తస్మాచ్ఛబ్ద సముత్పత్త్యైః ఘణ్టారావం కరోమ్యహమ్ ॥

*(ఎడమచేతితో ఉద్ధరణితో చెంబులోనుంచి నీటిని తీసికొని కుడిచేతి బొటనవ్రేలిని ఉద్ధరణిలోని నీటిలో ముంచి క్రింది శ్లోకమును చదువుతూ శిరమువైన మూడు మార్లు చల్లుకొనవలయును)*

శ్లో॥ అపవిత్రః పవిత్రోవా సర్వాఽవస్థాఙ్గతోపివా ।
యస్మరేత్ పుణ్డరీకాక్షం సబాహ్యాఽభ్యన్తరం శుచిః ॥

*(ధర్మపత్ని శిరముపైన కూడా అటులే చేల్లవలయును)*

**ఆచమ్య ।** *(దంపతులిర్వురూ కేశవాది నామములను స్మరించుతూ ముమ్మారు ఆచమనమును చేయవలయును)*

| **భర్త:** | **పత్ని :** |
|---|---|
| ౧.ఓం కేశవాయ స్వాహా (నమః) । | ౧.(ఔం) కేశవాయ నమః । |
| ౨.ఓం నారాయణాయ స్వాహా(నమః) । | ౨.(ఔం)నారాయణాయ నమః । |
| ౩.ఓం మాధవాయ స్వాహా (నమః ) । | ౩.(ఔం)మాధవాయ నమః । |

*క్రింది నామములను ధ్యానించవలెను.*

౪.ఓం గోవిన్దాయ నమః ।
౫.ఓం విష్ణవే నమః ।
౬.ఓం మధుసూదనాయ నమః ।
౭.ఓం త్రివిక్రమాయ నమః ।
౮.ఓం వామనాయ నమః ।
౯.ఓం శ్రీధరాయ నమః ।
౧౦.ఓం హృషీకేశాయ నమః ।
౧౧.ఓం పద్మనాభాయ నమః ।
౧౨.ఓం దామోదరాయ నమః ।
౧౩.ఓం సఙ్కర్షణాయ నమః ।
౧౪.ఓం వాసుదేవాయ నమః ।
౧౫.ఓం ప్రద్యుమ్నాయ నమః ।
౧౬.ఓం అనిరుద్ధాయ నమః ।
౧౭.ఓం పురుషోత్తమాయనమః।
౧౮.ఓం అధోక్షజాయ నమః ।
౧౯.ఓం నారసింహాయ నమః ।
౨౦.ఓం అచ్యుతాయ నమః ।
౨౧.ఓం జనార్దనాయ నమః ।
౨౨.ఓం ఉపేన్ద్రాయ నమః ।
౨౩.ఓం హరయే నమః ।
౨౪.ఓం శ్రీకృష్ణాయ నమః ।

## మహాగణాధిపతి పూజ

*(ఒక పళ్ళెములో బియ్యమును (పావుకిలో) పోసి ఉంచవలయును. పసుపుతో గణపతిని చేసి ఒక తములపాకుపైన ఉంచవలయును)*

**మం ॥ ఓం దేవీం వాచమ జనయన్త దేవాస్తాం విశ్వరూపాః పశవో వదన్తి।**

**సానోమన్ద్రేష మూర్జన్దుహానా ధేనుర్వాగస్మానుపసుష్టుతైతు ।**

అయం ముహూర్తస్సుముహూర్తోఽస్తు ।

శ్లో॥ య శ్శివోనామ రూపాభ్యాం యాదేవీ సర్వమఙ్గళా ।
తయో స్సంస్మరణాత్పుంసాం సర్వతో జయమఙ్గళమ్ ॥

శ్లో॥ శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే ॥

శ్లో॥ యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీర్విజయోభూతి ర్ధ్రువానీతి ర్మతిర్మమ ॥

శ్లో॥ స్మృతే సకలకల్యాణభాజనం యత్ర జాయతే ।
పురుషస్తమజం నిత్యం వ్రజామి శరణం హరిమ్ ॥

శ్లో॥ సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషామమఙ్గళమ్ ।
యేషాం హృదిస్థో భగవాన్ మఙ్గళాయతనం హరిః ॥

శ్లో॥ లాభస్తేషాం జయస్తేషా ఙ్కుతస్తేషాం పరాభవః ।
యేషామిన్దీవరశ్యామో హృదయస్థో జనార్దనః ॥

శ్లో॥ అపదా మపహర్తారం దాతారం సర్వసమ్పదామ్ ।
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్ ॥

శ్లో॥ సర్వమఙ్గళ మాఙ్గళ్యే శివే సర్వార్థసాధకే ।
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోస్తుతే ॥

శ్లో॥ తదేవ లగ్నం సుదినం తదేవ తారాబల ఞ్చన్ద్రబలం తదేవ ।
విద్యాబలం దైవబలం తదేవ లక్ష్మీపతే తేఽఙ్ఘ్రియుగం స్మరామి ॥

శ్రీ లక్ష్మీనారాయణాభ్యాం నమః । ఉమామహేశ్వరాభ్యాం నమః ।
వాణీహిరణ్యగర్భాభ్యాం నమః । శచీపురన్దరాభ్యాం నమః ।
అరున్ధతీవసిష్ఠాభ్యాం నమః । శ్రీ సీతారామాభ్యాం నమః ।
సర్వేభ్యో బ్రాహ్మణేభ్యో మహాజనేభ్యో నమః ।

**ఆచమ్య ।** *(వ్రతకర్త, ధర్మపత్ని మూడు మార్లు ఆచమనమును చేయవలయును)*

ఓం కేశవాయస్వాహా(నమః) ।....శ్రీ కృష్ణాయనమః ।

*(కాసిని అక్షతలను కుడి అరచేతిలోకి తీసికొని, క్రింది శ్లోకమును పఠించే వలయును)*

శ్లో॥ ఉత్తిష్ఠన్తు భూతపిశాచాః యేతే భూమిభారకాః ।
ఏతేషా మవిరోధేన బ్రహ్మకర్మ సమారభే ॥
(శ్లో॥ భూతగ్రహ పిశాచాది విఘ్నకర్తృ నివారణమ్ ।
సకృన్మన్త్రం సముచ్చార్య ఆసనం పరికల్పయేత్ ॥)

*(అక్షతలను వాసన చూసి ఎడమ భుజము మీదుగ వెనుకకు వేల్లవలయును. ప్రాణాయామమును చేయవలయును)*

(శ్లో॥ భూమ్యాదేదూర్ధ్వలోకస్య ఉపరిస్థో దివాకరః ।
దశప్రణవ సంయుక్తం త్రిరావృత్యా పునః పునః ॥
అఙ్గుళ్యాగ్రై నాసికాగ్రం సంపీడ్య పాపనాశనమ్ ।
ప్రాణాయామ మిదం ప్రోక్తం ఋషిభిః పరికల్పితమ్ ॥)

**మం ॥ ఓం భూః ।ఓం భువః ।ఓగ్ం సువః ।ఓం మహః । ఓం జనః ।ఓం తపః। ఓగ్ం సత్యం । ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియోయోనః ప్రచోదయాత్ । ఓమాపో జ్యోతీ రసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్ ॥**

మమోపాత్త దురితక్షయద్వారా శ్రీపరమేశ్వరప్రీత్యర్థం శుభే శోభనేముహూర్తే శ్రీమహావిష్ణోరాజ్ఞయా ప్రవర్తమానస్య అద్యబ్రహ్మణః ద్వితీయపరార్ధే శ్వేత వరాహ కల్పే వైవస్వతమన్వన్తరే కలియుగే ప్రథమపాదే జమ్బూద్వీపే భారత వర్షే భరతఖణ్డే మేరోర్దక్షిణదిగ్భాగే శ్రీశైలస్య ...... ప్రదేశే కృష్ణా (గఙ్గా) గోదావర్యోర్మధ్యప్రదేశే స్వ (వసతి) గృహే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాన్ద్రమానేన ... నామ సంవత్సరే ......ఆయనే ....ఋతౌ .....మాసే ...పక్షే ....తిథౌ ...వాసరే శుభనక్షత్రే శుభయోగే శుభకరణ ఏవఙ్గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీమాన్ .....గోత్రః ....నామధేయః ధర్మపత్నీ సమేతః అహం శ్రీమతః .... గోత్రస్య .....నామధేయస్య ధర్మపత్నీసమేతస్య మమ సకుటుమ్బస్య సపుత్రకస్య (సభ్రాతృకస్య) సపరివారస్య (సబాన్ధవస్య) అస్మిన్ కలియుగే కలిపురుష ప్రేరణయా, కాయక వాచిక మానసిక శారీరక కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యకృత దుష్టసఙ్కల్పాది జనిత దోషనివృత్తి ద్వారా నిత్యసన్తుష్టి సిద్ధ్యర్థం, ధర్మార్థ కామమోక్ష చతుర్విధ ఫలపురుషార్థ

సిద్ధ్యర్థం, మమగృహే అలక్ష్మీ పరిహారద్వారా లక్ష్మీ స్థిరనివాస సిద్ధ్యర్థం, క్షేమ స్థైర్య ధైర్య విజయ అభయ ఆయురారోగ్య సిద్ధ్యర్థం, మనుష్య జన్మ రాహిత్యపూర్వక సాలోక్య సామీప్య సాయుజ్య నామక మోక్షప్రాప్త్యర్థం స్కాన్ద పురాణాన్తర్గత నారద మహావిష్ణు సంవాదస్థిత రమాసహిత శ్రీసత్య నారాయణవ్రత ఙ్కరిష్యే ।

*(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*

**ఆదౌ నిర్విఘ్నేన పరిసమాప్త్యర్థం శ్రీమహాగణాధిపతి పూజా ఙ్కరిష్యే ।**

*(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*

**తదఙ్గ కలశారాధన ఙ్కరిష్యే ।** *(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*

*(ఒక కలశపాత్రను పీఠమునకు యజమానికి మధ్య ముందు భాగములో ఒక తములపాకు మీద పెట్టవలయును. ఇది పూజాజల కలశము. ఆచమనము, సంకల్పమునకు తప్ప, ఉత్తరోత్తరా పూజా కార్యక్రమములో ఉపయోగించే జలమును ఈ కలశము నుంచియే గ్రహించేవలయును)*

**కలశం గన్ధపుష్పాక్షతైరభ్యర్చ్య ।**

కలశే ఉదకం పూరయిత్వా *(పై కలశపాత్రను నీటితో నింపవలయును).*

*(కలశపాత్రను మూడు వైపుల గన్ధము, కుంకుమ, అక్షతలతో అలఙ్కరించే వలయును. కలశపాత్ర నీటిలో సువాసన గల పుష్పము, చందనము, తులసీ దళములను వేయవలయును)*

**కలశస్యోపరి హస్తం నిధాయ ।**

*(కలశపాత్రపైన అరచేయి బోర్లించి పెట్టవలయును. ఉంగరపు వేలును నీటిలో ముంచేవలయును. లేదా కలశపాత్ర పైన అరచేతులతో కూర్మ లేదా మత్స్య ముద్రను పట్టవచ్చును)*

శ్లో॥ కలశస్యముఖే విష్ణుః కణ్ఠేరుద్రస్సమాశ్రితః ।
మూలేతత్ర స్థితోబ్రహ్మా మధ్యే మాతృగణాస్మృతాః ।
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసున్ధరా ।
ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదో హ్యథర్వణః ।
అఙ్గైశ్చసహితాస్సర్వే కలశామ్బుసమాశ్రితాః ।
సర్వేసముద్రా స్సరిత తీర్థానిచ నదా హ్రదాః ।
ఆయాన్తు దేవపూజార్థం దురితక్షయకారకాః ॥

మం ॥ ఆకలశేషుధావతి । పవిత్రే పరిషిచ్యతే । ఉక్థైర్యజ్ఞేషువర్ధతే । ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వా భూతాన్యాపః ప్రాణావా ఆపః పశవ ఆపోన్న మాపోఽ మృత మాప స్సమ్రాడాపో విరాడాపస్స్వరా డాపశ్ఛన్దాగ్ స్యాపో జ్యోతీగ్ష్యా పో యజూగ్ష్యాపస్సత్య మాపస్సర్వా దేవతాఆపో భూర్భువస్సువరాపఓమ్ ।

శ్లో॥ గఙ్గేచ యమునే కృష్ణే గోదావరి సరస్వతి ।
నర్మదేసిన్ధు కావేర్యా జలేఽస్మిన్ సంనిధిఙ్కురు ॥
శ్లో॥ కావేరీ తుఙ్గభద్రాచ కృష్ణవేణీచ గౌతమీ ।
భాగీరథీచ విఖ్యాతాః పఞ్చగఙ్గాః ప్రకీర్తితాః ॥

*(కలశముపై నుంచిన చేతిని తీసి, ఒక తములపాకును కలశములోని నీటిలోముంచి తీసి, ఆ నీటిని, .. ..)*

**కలశోదకేన పూజాద్రవ్యాణి సమ్ప్రోక్ష్య ।**

*(.. పూజా ద్రవ్యముల పైన చేల్లవలయును)*

**దేవం సమ్ప్రోక్ష్య ।** *(పసుపు గణపతి పైన చేల్లవలయును)*

**ఆత్మానంచ సమ్ప్రోక్ష్య ।**

*(తన శిరము పైన, ధర్మపత్ని శిరము పైన మరియు పూజలో పాల్గొనుచున్న పరి వారము పైన చేల్లవలయును)*

***గణపతి ఆవాహన ఙ్కరిష్యే ।***

**మం ॥ ఏకదన్తాయవిద్మహే శూర్పకర్ణాయ ధీమహి ।**
**తన్నో దన్తిః ప్రచోదయాత్ ॥**

శ్లో॥ హే హేరమ్బ త్వమేహ్యేహి అమ్బికా త్ర్యమ్బకాత్మజ ।
సిద్ధిబుద్ధిర్యుత త్ర్యక్ష సర్వలోకపితః పితః ॥
నాగాస్య నాగహారత్వం గణనాథం చతుర్భుజమ్ ।
భూషితస్స్వాయుధైర్దివ్యైః పాశాఙ్కుశ పరస్వధైః ॥
ఆవాహయామి పూజార్థం రక్షార్థఞ్చ గణాధిప ।
విఘ్నేశ్వరమహం వన్దే చిన్తితార్థ ప్రదాయకమ్ ।
శైలాత్మజా సుతం దేవం నిర్విఘ్నార్థం గణాధిపమ్ ॥

శ్రీమహాగణాధిపతయేనమః । సాఙ్గం సాయుధం సవాహనం సశక్తి పత్నీ పుత్ర పరివారసమేతం శ్రీమహాగణాధిపతి మావాహయామి స్థాపయామి పూజయామి ।

*(పళ్ళెములోని బియ్యము మీద తములపాకుతో పాటు పసుపు గణపతిని ఉంచవలయును)*

**తదఙ్గ ప్రాణప్రతిష్ఠాపనఙ్కరిష్యే ।** *(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*

*(ఒక తములపాకును కలశములోని నీటిలో ముంచి తీసి, పసుపు గణపతి పైన తగులకుండా కుడిచేతి వ్రేళ్ళతో ఆచ్ఛాదనలా పట్టుకొనవలయును)*

**మం ॥ ఓం అసునీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణమిహనో ధేహిభోగమ్ । జ్యోక్పశ్యేమ సూర్య ముచ్చరన్త మనుమతే । మృళయానస్స్వస్తి । అమృతం పై ప్రాణా అమృత మాపః । ప్రాణానేవ యథాస్థానముపహ్వయతే॥**

(శ్లో॥ శిరః శ్రోత్రం తథా నాసామోష్ఠం జిహ్వాం తథైవచ ।
కణ్ఠం కుక్షిఞ్చ హృదయం కటి బాహూ తథాఙ్గళీన్ ।
ఊరూ జానూచ పాదాన్తం త త్తం న్యాసం వినిర్దిశేత్ ।)

*(తములపాకును తిరిగి కలశములో ఉంచవలయును. కుడిచేతిలోకి అక్షతలను తీసికొనవలయును. పసుపు గణపతి పైన* ***'..భవ'*** *అనినప్పుడల్లా అక్షతలను వేయవలయును)*

ఓం శ్రీమహాగణాధిపతయేనమః । స్థిరోభవ । వరదోభవ । సుముఖోభవ । సుప్రసన్నోభవ । మమ అభిముఖోభవ । స్థిరాసనఙ్కురు ।

శ్లో ॥ స్వామిన్ సర్వజగన్నాథ యవత్పూజావసానకమ్ ।
తావత్త్వం ప్రీతిభావేన బిమ్బేస్మిన్ సంనిధిఙ్కురు ॥
అభీప్సితార్థ సిద్ధ్యర్థం పూజితో యస్సురైరపి ।
సర్వ విఘ్నచ్ఛిదే తస్మై గణాధిపతయే నమః ॥

***ధ్యానమ్***

శ్లో॥ శుక్లామ్బరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాన్తయే ॥

**మం ॥ ఓం గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవిఙ్కవీనా ముపమశ్ర వ స్తమమ్ । జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆనశ్శృణ్వన్నూతిభి స్సీద సాదనమ్ ॥**

శ్రీమహాగణాధిపతయేనమః । ధ్యాయామి ।

*(రెండు పుష్పములను పసుపు గణపతి పైన ఉంచి, నమస్కరించేవలయును)*

**ఆవాహయామి** । *(అక్షతలను వేయవలయును)*

**నవరత్న ఖచిత సింహాసనం సమర్పయామి ।** *(అక్షతలను వేయవలయును)*

**పాదయోః పాద్యం సమర్పయామి ।** *(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి గణపతికి చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

**హస్తయోః అర్ఘ్యం సమర్పయామి ।** *(ముందటి వలెనే)*
**ముఖే ఆచమనీయం సమర్పయామి ।** *(ముందటి వలెనే)*

**స్నానమ్**

శ్రీమహాగణాధిపతయేనమః । స్నానం సమర్పయామి ।
*(తములపాకుతో కలశములోని జలమును పసుపు గణపతి పైన తొమ్మిది మారులు క్రింది తొమ్మిది మన్త్రములు పఠించుతూ చిలుకరించేవలయును)*

**మం ॥ ఓం ఆపోహిష్ఠామ యోభువః । తానఊర్జేదధాతన । మహేరణాయ చక్షసే । యోవశ్శివతమో రస స్తస్యభాజయతేహనః । ఉశతీరివ మాతరః । తస్మా అరఙ్గ మామ వో యస్యక్షయాయ జిన్వథ । ఆపో జనయ థాచనః ।**

శ్లో ॥ గఙ్గాది సర్వ తీర్థేషు ఆహృతై రమలై ర్జలైః ।
స్నానఙ్కురుష్వ భగవన్ గణాధిప నమోస్తుతే ॥

స్నానానన్తరం ఆచమనీయం సమర్పయామి ।

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి గణపతికి చూపి ఒక పాత్రలోకి విడువ వలయును)*

## వస్త్రమ్

**మం ॥ అభివస్త్రా సువసనాన్య ర్షాభిధేనూ స్సుదుఘాః పూయమానాః ।**

**అభిచన్ద్రాభర్తవేనో హిరణ్యా భ్యశ్వా న్రథినోదేవసోమ ।**

శ్లో ॥ రక్తవస్త్రద్వయ ఞ్చారు దేవయోగ్యఞ్చ మఙ్గళమ్ ।

శుభప్రదం గృహాణత్వం లమ్బోదర హరాత్మజ ॥

శ్రీమహాగణాధిపతయేనమః । వస్త్రయుగ్మం సమర్పయామి ।

*(తడిగన్ధముతో పాటు కుంకుమ అద్దిన రెండు చిన్న పత్తిఖండములను సమర్పించే వలయును. లేదా "వస్త్ర యుగ్మార్థం పుష్పయుగ్మం సమర్పయామి" అంటూ రెండు పుష్పములను సమర్పించేవలయును)*

వస్త్రయుగ్మధారణానన్తరం ఆచమనీయం సమర్పయామి ।

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి గణపతికి చూపి ఒక పాత్రలోకి విడువ వలయును)*

## యజ్ఞోపవీతమ్

**మం ॥ యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్యత్సహజం పురస్తాత్ ।**

**ఆయుష్య మగ్ర్యం ప్రతిముఞ్చ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః ॥**

శ్లో ॥ రాజితం బ్రహ్మసూత్రఞ్చ కాఞ్చన ఞ్చోత్తరీయకమ్ ।

గృహాణ సర్వ ధర్మజ్ఞ భక్తానామిష్ట దాయక ॥

శ్రీమహాగణాధిపతయేనమః । యజ్ఞోపవీతం సమర్పయామి ।

*(గన్ధము కుంకుమలను అద్దిన, నిజమైన యజ్ఞోపవీతము గాని, జపమాల వంటి ప్రత్తితో చేసిన సూత్రమును గాని సమర్పించేవలయును. లేదా యజ్ఞోపవీతార్థం అక్షతాన్ సమర్పయామి అని అక్షతలను సమర్పించేవలయును)*

యజ్ఞోపవీతధారణానన్తరం ఆచమనీయం సమర్పయామి ।

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి గణపతికి చూపి ఒక పాత్రలోకి విడువ వలయును)*

*గన్ధమ్*

**మం ॥ గన్ధద్వారాన్దురా ధర్షా న్నిత్యపుష్టా జ్కరీషిణీమ్ ।**

**ఈశ్వరీగ్ం సర్వభూతానాన్తామిహోపహ్వయే శ్రియమ్ ॥**

శ్లో ॥ శ్రీగన్ధ ఇ్చన్దనోన్మిశ్రం కర్పూరేణ సుసంయుతమ్ ।

విలేపయ సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥

శ్రీమహాగణాధిపతయేనమః । శ్రీగన్ధం ధారయామి ।

*(పసుపు గణపతికి తడి చన్దనమును అద్దవలయును)*

***అక్షతాన్***

**మం ॥ ఓం ఆయనే తేపరాయణే దూర్వారోహన్తుపుష్పిణీః ।**

**హ్రదాశ్చపుణ్డరీకాణి సముద్రస్య గృహాఇమే ॥**

శ్లో॥ అక్షతా న్ధవళా న్దివ్యా న్శాలీ న్తణ్డుల నిర్మితాన్ ।

గృహాణ పరమానన్ద ఈశపుత్ర నమోస్తుతే ॥

శ్రీమహాగణాధిపతయేనమః । గన్ధస్యోపరి అలఙ్కరణార్థం కుఙ్కుమాక్షతాన్ సమర్పయామి ।

*(పసుపు గణపతికి కుంకుమను అద్ది, అక్షతలను వేయవలయును)*

***పుష్పైః పూజయామి । అక్షతైః పూజయామి ।***

*(క్రింది నామములతో గణపతికి ఒక్కొక్క నామమునకు రెండు పూలు, రెండు గరిక పోచేలు, అక్షతలను సమర్పించేతూ పూజింపవలయును)*

ఓం సుముఖాయనమః । ఓం ఏకదన్తాయనమః । ఓం కపిలాయనమః ।
ఓం గజకర్ణకాయనమః । ఓం లమ్బోదరాయనమః । ఓం వికటాయనమః ।
ఓం విఘ్నరాజాయనమః । ఓం గణాధిపాయనమః । ఓం ధూమకేతవేనమః ।
ఓం గణాధ్యక్షాయనమః । ఓం ఫాలచన్ద్రాయనమః । ఓం గజాననాయనమః ।
ఓం వక్రతుణ్డాయనమః । ఓం శూర్పకర్ణాయనమః । ఓం హేరమ్బాయనమః ।
ఓం స్కన్దపూర్వజాయనమః । ఓం సర్వసిద్ధిప్రదాయకాయనమః ।ఓం కుమార గురవేనమః । ఓం వినాయకాయనమః । ఓం మహాగణాధిపతయేనమః ।

నానావిధ పరిమళ పత్ర దూర్వా పుష్పాక్షత పూజాం సమర్పయామి ।

### *ధూపమ్*

శ్లో॥ వనస్పత్యుద్భవై ర్దివ్యై ర్నానాగన్ధై స్సుసంయుతః ।
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥

ఓం శ్రీమహాగణాధిపతయేనమః । ధూపమాఘ్రాపయామి ।
*(రెండు అగరువత్తులను లేదా సాంబ్రాణిని వెలిగించి, ఆ ధూపమును గణపతి వైపు చేతితో వీయవలయును)*

### *దీపమ్*

శ్లో॥ సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినాయోజితం ప్రియమ్ ।
గృహాణ మఙ్గళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్ ॥

ఓం శ్రీమహాగణాధిపతయేనమః । దీపం దర్శయామి ।
*(ఆవునేతితో మూడువత్తులను వేసి వెలిగించి గణపతికి చూపవలయును)*
*(లేదా కర్పూర దీపమును చూపించవచ్చును.*

శ్లో॥ కర్పూరవాసితం యుక్తం కాంస్యపాత్ర స్థితం శుభమ్ ।
గృహాణ మఙ్గళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్ ॥)

ధూపాఘ్రాణ దీప దర్శనానన్తరం ఆచమనీయం సమర్పయామి ।
*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

### *నైవేద్యమ్*

*(గణపతికి ఎదురుగా ఒక పాత్రలో తములపాకు మీద బెల్లపు తునకను ఉంచి క్రింది మన్త్రమును చేదువుతూ తములపాకుతో కలశములోని జలమును ప్రోక్షించవలయును)*

(పురాణోక్తం: పుణ్డరీకాక్ష గోవిన్ద వాసుదేవ జనార్దన ।
మయార్పితమిదం ద్రవ్యం పవిత్రం కురు సర్వదా ॥ గోవిన్ద గోవిన్ద గోవిన్ద,
ప్రోక్ష్య, పరిషిచ్య, నమోనమ శ్రీపుణ్డరీకాక్ష పుణ్డరీకాక్షాయ నమః ।
శ్రీమహాగణాధిపతయేనమః । యథాభాగం గుడోపహారం నివేదయామి।)
మం ॥ ప్రాణాయ నమః । ...సమానాయ నమః ।
మధ్యేమధ్యే పానీయం సమర్పయామి । ఉత్తరాపోశనం సమర్పయామి ।)

**మం ॥ ఓం భూర్భువస్సువః । తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ।**

**ధియోయోనః ప్రచోదయాత్ ।** కలశోదకేన సమ్ప్రోక్ష్య ।

*(క్రింది మన్త్రమును చేదువుతూ బెల్లపుతునక ఉన్న తములపాకు మేట్టూ ఉద్ధరణితో కలశములోని నీటిని ప్రదక్షిణముగా ప్రోక్షించేవలయును)*

**మం ॥ సత్యం త్వర్తేన పరిషించామి । (**రాత్రి: **ఋతంత్వా సత్యేన పరిషించామి)** కలశోదకేన పరిషిచ్య ।

ఓం శ్రీమహాగణాధిపతయేనమః ।

**మం ॥ అమృతమస్తు ।**

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి గణపతికి చూపి ఒక పాత్రలోకి విడువ వలయును)*

**మం ॥ అమృతోపస్తరణమసి ।**

ఓం శ్రీమహాగణాధిపతయేనమః । యథాభాగం గుడోపహారం నివేదయామి ।
*(క్రింది అయిదు మన్త్రములతో బెల్లపు తునకను గణపతికి, తములపాకుతో చూపుతూ నివేదించేవలయును)*

**మం ॥ ఓం ప్రాణాయస్వాహా। ఓం అపానాయస్వాహా। ఓం వ్యానాయస్వాహా ।**

**ఓం ఉదానాయస్వాహా । ఓం సమానాయస్వాహా ।**

మధ్యేమధ్యే పానీయం సమర్పయామి ।

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి గణపతికి చూపి ఒక పాత్రలోకి విడువ వలయును)*

**మం ॥ అమృతాపిధానమసి ।**

ఉత్తరాపోశనం సమర్పయామి । *(ముందటి వలెనే)*
హస్తౌ ప్రక్షాళయామి । *(ముందటి వలెనే)*
పాదౌ ప్రక్షాళయామి । *(ముందటి వలెనే)*

ఆచమనీయం సమర్పయామి । *(ముందటి వలెనే)*

**తామ్బూలమ్**

శ్లో॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతమ్ ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తామ్బూలం ప్రతిగృహ్యతామ్ ॥

ఓం శ్రీమహాగణాధిపతయేనమః । తామ్బూలం సమర్పయామి ।

*(పూగీఫలము, లవఙ్గము, ఏలకులు, పచ్చకర్పూరము మొదలుగా గల తాంబూల ద్రవ్యములతో ఐదు లేత తములపాకుల తాంబూలమును సమర్పించవలయును)*

తామ్బూలచర్వణానన్తరం ఆచమనీయం సమర్పయామి ।

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

**నీరాజనమ్**

*(హారతిపాత్రలో తగినంత కర్పూరమును వేసి వెలిగించి హారతిగాచూపవలయును)*

శ్లో॥ నీరాజనం సమానీతం కర్పూరేణ సమన్వితమ్ ।
తుభ్యం దాస్యామ్యహం దేవం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥

**మం ॥ హిరణ్యపాత్రం మధోః పూర్ణం దదాతి । మధవ్యో సానీతి । ఏకథా బ్రహ్మణ ఉపహరతి । ఏకధైవ యజమాన ఆయుస్తేజోదధాతి । సామ్రాజ్యం భోజ్యం స్వారాజ్యం వైరాజ్యమ్ । పారమేష్ఠ్యగ్ం రాజ్యం మహారాజ్య మాధిపత్యమ్ । సమ్రాజఞ్చ విరాజఞ్చాభి శ్రీర్యాచనో గృహే । లక్ష్మీ రాష్ట్రస్యయా ముఖేతయా మాసగ్ం సృజామసి ॥**

ఓం శ్రీమహాగణాధిపతయేనమః । కర్పూర ఆనన్దనీరాజనం దర్శయామి ।
నీరాజ దర్శనానన్తరం ఆచమనీయం సమర్పయామి ।

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును. కర్త, పరివారము అందరూ నీరాజనమును భక్తితో నమస్కరించి కనులకు అద్దుకొనవలయును)*

**మన్త్రపుష్పమ్**

*(కుడి అరచేతిలోకి ఒక పుష్పమును, ఒక నాణెమును తీసికొని, లేచి నిలబడి,*

*ఎడమ అరచేతిలో కుడి అరచేతిని ఉంచి ఈ క్రింది శ్లోకపఠనము పూర్తి అయిన పిమ్మట గణపతికి సమర్పించేవలయును)*

శ్లో॥ సుముఖ శ్చైకదన్తశ్చ కపిలో గజకర్ణకః ।
లమ్బోదరశ్చ వికటో విఘ్నరాజో గణాధిపః ॥
ధూమకేతు ర్గణాధ్యక్షః ఫాలచన్ద్రో గజాననః ।
వక్రతుణ్డ శ్శూర్పకర్ణో హేరమ్బ స్కన్దపూర్వజః ॥
షోడశైతాని నామాని యః పఠేచ్ఛృణుయాదపి ।
విద్యారమ్భే వివాహేచ ప్రవేశే నిర్గమే తథా ॥
సఙ్గ్రామే సర్వకార్యేషు విఘ్నస్తస్య న జాయతే ।
మహాగణాధిపతి పాదారవిన్దయోః సువర్ణ దివ్యమన్త్రపుష్పం సమర్పయామి ।
*(పుష్పము, నాణెములను గణపతికి సమర్పించేవలయును)*

**ఆత్మప్రదక్షిణమ్**

శ్లో॥ యానికానిచ పాపాని జన్మాన్తర కృతానిచ ।
తానితాని ప్రణశ్యన్తి ప్రదక్షిణం పదేపదే ॥
పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసమ్భవః ।
త్రాహిమాం కృపయా దేవ శరణాగతవత్సల ॥
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ ।
తస్మాత్ కారుణ్య భావేన రక్ష రక్ష గణాధిప ॥

శ్రీమహాగణాధిపతయేనమః । ఆత్మప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి ।
*(కర్త, పత్ని, పరివారము నిలబడి చేతులు జోడించి మూడుమారులు ఆత్మ ప్రదక్షిణము, అనగా తమచుట్టూ తాము ప్రదక్షిణముగా తిరుగుట, చేయ వలయును. తరువాత కూర్చుని, ఎడమ చేతితో ఉద్ధరణితో కలశములోని జలమును తీసికొని)*

శ్లో॥ విఘ్నేశ్వరాయ వరదాయ సురప్రియాయ । లమ్బోదరాయ సకలాయ జగద్ధితాయ । విద్యాధరాయ వికటాయచ వామనాయ । గౌరీసుతాయ గణనాథ నమో నమస్తే ॥

శ్లో॥ యస్య స్మృత్యాచ నామోక్త్యా తపో పూజా క్రియాదిషు ।
న్యూనం సమ్పూర్ణతాం యాతి సద్యో వన్దే గణాధిపమ్ ॥

మన్త్రహీన జ్క్రియాహీనం భక్తిహీనం గణాధిప ।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

అనయా ధ్యానాఽవాహనాది షోడశోపచారపూజయాచ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతిః సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు ।

*(ఉద్ధరణిలోని నీటిని కుడిఅరచేతిలోకి పోసికొని, వ్రేళ్ళమీదుగా క్రిందికి పాత్రలోకి విడువవలయును)*

మమ (యజమానస్య) మహాగణాధిపతి ప్రసాదసిద్ధిరస్తు ।

ఉత్తరే శుభకర్మణ్యవిఘ్న మస్త్వితి భవన్తో బ్రువన్తు ।

**ఉత్తరే శుభకర్మణ్యవిఘ్నమస్తు ।**

శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణాతు ।

*(బ్రహ్మగారు కర్తకూ, పరివారమునకూ గణపతి పూజాక్షతలను శిరముపైన వేయ వలయును)*

శ్రీ మహాగణాధిపతి ప్రసాదం శిరసాగృహ్ణామి ।

*(గణపతి పూజాక్షతలను వేయించుకుంటున్నప్పుడు కర్త, పరివారము చెప్పవలయును)*

***ఆశీర్వచనమ్***

**మం ॥ శతమానం భవతి । శతాయుః పురుషశ్శతేన్ద్రియ ఆయుష్యేవేన్ద్రియే ప్రతితిష్ఠతి ॥**

(శ్రీర్వర్థ యాయుష్యం చారోగ్యం యథా శోభమానం । భూయాత్తే ధాన్యం ధనం పశుం బహుపుత్రలాభం శతసంవత్సరం దీర్ఘమాయుః ॥)

*(బ్రహ్మగారు కర్తకూ, పరివారమునకూ ఆశీరక్షతలను శిరముపైన వేయ వలయును)*

***ఉద్వాసనమ్***

**మం ॥ యజ్ఞేన యజ్ఞమయజన్త దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ ।**
**తేహనాకం మహిమాన స్సచన్తే యత్ర పూర్వే సాధ్యాస్సన్తి దేవాః ।**

(శ్లో॥ దేవా యజ్ఞేనాఽయజన్త యజ్ఞంపై యజ్ఞపూరుషమ్ ।
తే ధర్మాః ప్రథమే హ్యాసన్ సతాం లోకానువర్తినామ్ ॥

సచన్తేహి మహాత్మానో నాక మానన్ద చిద్భవమ్ ।
యత్రపూర్వే స సాధ్యాశ్చ సన్తి దేవాస్సనాతనాః ॥)
శ్లో ॥ వక్రతుణ్డ మహాకాయ సూర్యకోటి సమప్రభ ।
నిర్విఘ్నఙ్కురు మే దేవ సర్వకార్యేషు సర్వదా ॥
శ్రీ మహాగణాధిపతిం యథాస్థానం ప్రవేశయామి ।
*(పసుపు గణపతిని ఉంచిన తములపాకును తూర్పువైపుకు లేదా ఉత్తరము వైపునకు కొంచెము జరుపవలయును)*

**మం ॥ తత్పురుషాయ విద్మహే వక్రతుణ్డాయ ధీమహి । తన్నో దన్తిః ప్రచోదయాత్ ॥ సహస్ర పరమాదేవీ శతమూలా శతాఙ్కురా । సర్వగ్ం హరతు మే పాపం దూర్వా దుస్స్వప్న నాశనీ ।**

శోభనార్థం పునరాగమనాయచ । *(నమస్కరించవలయును).* ఓం తత్సత్ ।

## *ప్రతిమా శోధనమ్ ।*

శ్లో॥ దధి సర్పి ర్మధుః క్షీరైః శర్కరేణ ఫలైస్సహ ।
ప్రక్షాళనం ప్రకుర్వీత ప్రతిమాం శోధయేత్తతః ॥

**ఆచమ్య । ఓం కేశవాయ స్వాహా (నమః) ।...శ్రీ కృష్ణాయనమః ।**
పూర్వోక్త ఏవఙ్గుణ విశేషణ విశిష్టాయాం శుభతిథౌ శ్రీ రమాసత్యనారాయణ స్వామి వ్రతఙ్కరిష్యే । *(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*
వ్రతాఙ్గత్వేన అగ్నితప్తన తాడన భేదనాది దోషపరిహారార్థం ప్రతిమాశోధన ఙ్కరిష్యే । *(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*
*(సత్యనారాయణస్వామి వారి ప్రతిమను ఒక తములపాకులో ఉంచి, దానిని హరివాణములో పెట్టుకొని, పంచామృతములతో అభిషేకించవలయును. లేదా తములపాకుతో పంచామృతములను ప్రతిమ మీద చిలుకరించవలయును. పంచామృతములను విడివిడిగా సిద్ధముగా అందుబాటులో ఉంచుకొనవలయును)*

**మం ॥ దధిక్రావుణ్ణో అకారిషమ్ జిష్ణోరశ్వస్య వాజినః ।**

**సురభినో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్ ॥**

శ్లో॥ పయసస్తు సముద్భూతం మధురామ్లం శశిప్రభమ్ ।
దధ్యానీతం మయాదేవ స్నానార్థం ప్రతిగృహ్యతామ్ ॥
దధ్నా స్నపయామి । *(ఆవుపెరుగుతో)*

**మం ॥ శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్సవితోత్పునా త్వచ్ఛిద్రేణ**
**పవిత్రేణ వసోస్సూర్యస్య రశ్మిభిః ॥**

శ్లో॥ నవనీత సముత్పన్నం సర్వ సంతోషకారకమ్ ।
ఘృతం తుభ్యం ప్రదాస్యామి స్నానార్థం ప్రతిగృహ్యతామ్ ॥
ఆజ్యేన స్నపయామి । *(ఆవునేతితో)*

**మం ॥ మధువాతా ఋతాయతే మధుక్షరన్తి సిన్ధవః । మాధ్వీర్నః సన్త్వో షధీః । మధునక్తముతోషసి మధు మత్పార్థివగ్ం రజః । మధుద్యౌరస్తునః పితా । మధుమాన్నో వనస్పతి ర్మధుమాగ్ం అస్తు సూర్యః । మాధ్వీర్గావో భవన్తునః ॥**

శ్లో॥ పుష్పరేణు సముద్భూతం సుస్వాదు మధురం మధుః ।
తేజః పుష్టికరం దివ్యం స్నానార్థం ప్రతిగృహ్యతామ్ ॥
మధునా స్నపయామి *(తేనెతో)*

**మం ॥ ఆప్యాయస్వ సమేతుతే విశ్వత స్సోమ వృష్ణియమ్ ।**
**భవా వాజస్య సఙ్గథే ॥**

శ్లో॥ కామధేను సముద్భూతం సర్వేషాం జీవనం పరమ్ ।
తేజః పుష్టికరం దివ్యం స్నానార్థం ప్రతిగృహ్యతామ్ ॥
క్షీరేణ స్నపయామి । *(ఆవుపాలతో)*

**మం ॥ స్వాదుఃపవస్వ దివ్యాయ జన్మనే స్వాదురిన్ద్రాయ సుహవీతునామ్నే ।**
**స్వాదుర్మిత్రాయ వరుణాయవాయపే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః॥**

శ్లో॥ ఇక్షుసార సముద్భూతా శర్కరా పుష్టిదా శుభా ।
మలాపహారికా దివ్యా స్నానార్థం ప్రతిగృహ్యతామ్ ॥
శర్కరయా స్నపయామి । *(చక్కెరతో)*

**మం ॥ యాఃఫలినీర్యా అఫలా అపుష్పాయాశ్చ పుష్పిణీః ।**
**బృహస్పతి ప్రసూతాస్తానో ముఞ్చన్త్వగ్ం హసః ॥**

శ్లో॥ నారికేళ ఫలోద్భూతా త్రినేత్ర హర సమ్మిత ।
శిఖయా దురితం సర్వం పాపం పీడాఞ్చమేనుద ॥
నారికేళ జలేన స్నపయామి । *(లేత కొబ్బరిబొండాము నీటితో)*

**శుద్ధోదక స్నానమ్**

పఞ్చామృత ప్రక్షాళనానన్తరం శుద్ధోదక ప్రక్షాళన ఙ్కుర్యాత్ ।

శ్లో॥ తీర్థోదకైః కాఞ్చన కుమ్భ సంస్థైః సువాసితైర్దేవ కృపా రసార్ద్రైః ।
మయార్పితం స్నానవిధిం గృహాణ పాదాబ్జనిష్ఠ్యూత నదీప్రవాహః ॥

*(తములపాకుతో కలశములోని జలముతో ప్రతిమను తొమ్మిదిమారులు క్రింది మన్త్రములతో అభిషేకించవలయును లేదా ప్రోక్షించవలయును)*

**మం ॥ ఓం ఆపోహిష్ఠామ యోభువః । తానఊర్జేదధాతన । మహేరణాయ చక్షసే । యోవశ్శివతమో రస స్తస్యభాజయతేహనః । ఉశతీరివ మాతరః । తస్మా అరఙ్గ మామ వో యస్యక్షయాయ జిన్వథ । ఆపో జనయ థాచనః ।**

ప్రక్షాళ్య । *(ప్రతిమను కలశజలముతో కడిగి, శుభ్రమైన వస్త్రముతో తడి లేకుండా తుడువవలయును)*
అలఙ్కృత్య । *(ప్రతిమకు నుదుటి మీద చన్దనము, కుంకుమను పెట్టవలయును)*
తదఙ్గ పీఠార్చనఙ్కరిష్యే । *(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*

**పీఠార్చనమ్**

స్యోనాపృథివీతి భూమి మభిమన్త్ర్య ।

*(అక్షతలను కుడి అరచేతిలోకి తీసికొని క్రింది మన్త్రమును చదివి)*

**మం ॥ స్యోనాపృథివి భవానృక్షరా నివేశనీ । యచ్ఛానశ్శర్మసప్రథాః ।**

**మం ॥ మహీద్యౌః పృథివీచన ఇమం యజ్ఞం మిమిక్షితామ్ ।**

**పిపృతాంనో భరీమభిః ॥**

శ్లో॥ సర్వకర్మ సముద్భూతే సర్వ సస్యాభి వృద్ధయే ।
దేహిమే సర్వ సౌభాగ్య మస్మిన్కర్మణి మేదినీ ॥

*(పీఠము పైన అక్షతలను చేల్లవలయును)*

అభివస్త్రా ఇతి వస్త్ర మభిమన్త్ర్య ।

*(పీఠము మీద నూతన వస్త్రమును పరువవలయును)*

**మం ॥ అభివస్త్రా సువసనాన్య ర్షాభిధేనూస్సుదుఘాః పూయమానాః ।**

**అభిచన్ద్రాభర్తవేనో హిరణ్యాభ్యశ్వా న్రథినోదేవసోమ ॥**

శ్లో॥ శుక్లవస్త్రద్వయఞ్చారు దేవయోగ్యఞ్చ మఙ్గలమ్ ।
మనోహరం శుభప్రద మలఙ్కృత్య మిదంపీఠమ్ ॥

*(వస్త్రము పైన అక్షతలను చేల్లవలయును)*

ఓషధయ ఇతి తణ్డులాన్యభిమన్త్ర్య ।

*(పీఠము మీద పరచిన వస్త్రము పైన బియ్యమును పరుపవలయును)*
*(అక్షతలను కుడి అరచేతిలోకి తీసికొని క్రింది మన్త్రమును చదివి)*

**మం ॥ ఓషధయ స్సంవదన్తే సోమేన సహరాజ్ఞా ।**

**యస్మై కరోతి బ్రాహ్మణస్తగ్ం రాజన్పారయామసి ।**

శ్లో॥ ధాన్యౌషధి మనుష్యాణాం జీవనం పరమం స్మృతమ్ ।

క్షిప్తం యత్కార్యసమ్భూతం పీఠేచ ప్రక్షిపామ్యహమ్ ॥

*(పీఠము మీద పరచిన వస్త్రము మీది బియ్యము పైన చేల్లవలయును)*
*(పైపీఠముపైన క్రింది మన్త్రములతో 'నమః' అనినప్పుడల్లా, పుష్పాక్షతలను చేల్లుతూ పీఠమును పూజించేవలయును)*

ఆధార శక్త్యైనమః । కూర్మాయ నమః । మణ్డూకాయ నమః । కాలాగ్ని రుద్రాయ నమః । అనన్తాయ నమః । పృథివ్యై నమః । సుధాసముద్రాయ నమః । రత్నద్వీపాయ నమః । కల్పవృక్షాయ నమః । మణిప్రాసాదనాయ నమః । రత్నపీఠాయ నమః । రత్నపీఠే ఋగ్వేదమయ పూర్వద్వారే ద్వారశ్రియై నమః । గణేశాయనమః । స్కన్దాయ నమః । యజుర్వేదమయ దక్షిణద్వారే ద్వారశ్రియై నమః । బలాయ నమః । ప్రబలాయనమః । సామవేదమయ పశ్చిమద్వారే ద్వారశ్రియై నమః । చణ్డాయ నమః । ప్రచణ్డాయ నమః । అథర్వణవేదమయ ఉత్తరద్వారే ద్వారశ్రియై నమః । నన్దినే నమః । మహాకాళాయ నమః । ద్వారశాఖాసు గం గణపతయేనమః । భం భారత్యై నమః । లం లక్ష్మ్యై నమః । నన్దినే నమః । ధర్మాయ నమః । జ్ఞానాయ నమః । వైరాగ్యాయ నమః । ఐశ్వర్యాయ నమః । పద్మాయ నమః । ఆనన్దకన్దాయ నమః । జ్ఞాననాళాయ నమః । సవికారాయ నమః । పుష్పేభ్యోనమః । ప్రకృత్యాత్మక పత్రేభ్యో నమః । దళేభ్యో నమః । కేసరేభ్యో నమః । కర్ణికాయై నమః । కర్ణికామధ్యే అం అగ్నిమణ్డలాయ నమః । ఉం సూర్యమణ్డలాయ నమః । మం సోమమణ్డలాయ నమః । సం సత్వాయ నమః । రం రజసే నమః । తం తపసే నమః । ఆం ఆత్మనే నమః । అం అన్తరాత్మనే నమః । పం పరమాత్మనే నమః । హ్రీం జ్ఞానాత్మనే నమః । మం మాయాతత్వాయ నమః । విం విద్యాతత్వాయ నమః । పం పరమ తత్వాయ నమః । ఓం నమోభగవతే సకల గుణాత్మక శక్తియుక్తాయ అనన్తాయ యోగపీఠాత్మనే నమః । సర్వాధార పీఠాధిష్ఠాన దేవతాభ్యో నమః । నానావిధపరిమళ గన్ధపుష్పాక్షతాన్ సమర్పయామి ।

**మం ॥ ఋతగ్ం సత్యం పరంబ్రహ్మ పురుషం కృష్ణ పింగళమ్ ।**

**ఊర్ధ్వరేతం విరూపాక్షం విశ్వ రూపాయవై నమోనమః ॥**

ఓం నమస్సాఙ్గాయ సపరివారాయ శ్రీరమాసత్యనారాయణ పరబ్రహ్మణే నమః । ఏహ్యేహి ఆగఛ్ఛాఽగఛ్ఛ । సాన్నిధ్యఙ్కురు కురుస్వాహా ।

***వరుణ కలశారాధనమ్ ।***

ఆచమ్య । ఓం కేశవాయ ... ఓం కృష్ణాయ నమః ।

మమ సర్వారిష్ట పరిహారద్వారా ఆయుష్యాభివృధ్యర్థం శ్రీ రమాసహిత సత్యనారాయణ వ్రతాఙ్గత్వేన వరుణ దేవతా ప్రసాద సిద్ధ్యర్థం యథాశక్తిః వరుణ పూజాఙ్కరిష్యే ।

***వరుణకలశ స్థాపనమ్ ।***

*(ప్రధాన దేవకలశ స్థానమునకు ఉత్తరమున, కొంచెము బియ్యమును పీఠము మీద పోసి, దానిమీద ఒక చిన్న కలశపాత్రను పెట్టవలయును. కలశపాత్రను గన్ధ, కుంకుమ, పుష్పాక్షతలతో నలఙ్కరించేవలయును)*

**మం ॥ ఆకలశేషుధావతి పవిత్రే పరిషిచ్యతే । ఉక్థైర్యజ్ఞేషు వర్ధతే ॥**

*(ఈ క్రింది మన్త్రమును చెప్పుచూ కలశపాత్రలో జలమును నింపవలయును)*

**మం ॥ ఇమంమేవరుణ శ్రుధీహవ మద్యాచ మృడయ । త్వామవస్యురాచకే। తత్వాయామి బ్రహ్మణా వన్దమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః । అహేడ మానో వరుణేహబోధ్యురుశగ్ం సమాన ఆయుః ప్రమోషీః ॥**

శ్లో॥ పాశహస్తఞ్చ వరుణ మంభసాపతి మీశ్వరమ్ ।
ఆవాహయామి దేవేశం పూజేయం ప్రతిగృహ్యతామ్ ॥

అస్మిన్ కలశే వరుణమావాహయామి పూజయామి ।

*(ఒక వస్త్రమును కలశము మీద పెట్టి, దానిపై తాంబూలముతో గూడిన నారికేళమును పెట్టవలయును. పుష్పము, అక్షతలను వేయవలయును.)*

***సూత్ర వేష్టనమ్ ।***

శ్లో॥ సూత్రం కార్పాససంభూతం బ్రాహ్మణానిర్మితం పురా ।
యేన బద్ధం జగత్ సర్వ వేష్టనం కలశస్యచ ॥

*(ఒక తెల్లని వత్తితో చేసిన దారపు పోగును మూడు వరుసలు చేసి, పసుపు, కుంకుమలను పూసి దానికి ఒక పసుపుకొమ్మును, పుష్పములను కట్టి, కలశము యొక్క కంఠ భాగమునకు బంధించేవలయును)*
ఓం వరుణదేవాయ నమః । ధ్యానావాహనాది శోడశోపచార పూజాఙ్కుర్యాత్ ।
**తదఙ్గ ప్రాణప్రతిష్ఠాపనఙ్కరిష్యే ।** *(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*
*(ఒక తములపాకును పూజా కలశజలములో ముంచి తీసి, పై కలశము మీద అచ్ఛాదనగా పట్టవలయును)*

**ఓం అసునీతే.. .. ముపహ్వాయతే ॥**

*(తములపాకును తిరిగి పూజా జలకలశములో నుంచేవలయును.)*

(శ్లో॥ శిరః శ్రోత్రం తథా నాసామోష్ఠం జిహ్వాం తథైవచ ।
కణ్ఠం కుక్షిఞ్చ హృదయం కటి బాహూ తథాఙ్గళీన్ ।
ఊరూ జానూచ పాదాన్తం తత్తం న్యాసం వినిర్దిశేత్ ।)

ఓం వరుణాయ నమః । స్థిరోభవ। వరదోభవ । .. .. స్థిరాసనఙ్కురు ।
శ్లో॥ స్వామిన్ వరుణదేవేశ యావత్పూజావసానకమ్
తావత్వం ప్రీతిభావేన కలశే సంనిధిఙ్కురు ।
*(అక్షతలను, పుష్పములను వరుణ కలశము మీద చేల్లవలయును)*

**ధ్యానమ్**

శ్లో॥ పురీ శ్రద్ధావతీ యస్య ప్రియభార్యాచ కాళికా ।
నక్రవాహః పాశధరో వరుణః పశ్చిమేశ్వరః ॥
శ్లో॥ నాగపాశధరం హృష్టం రక్తౌఘద్యుతి విగ్రహమ్ ।
శశాఙ్కధవళం ధ్యాయేత్ వరుణం మకరాసనమ్ ॥
ఓం శ్రీవరుణాయ నమః । ధ్యాయామి । *(వరుణ కలశమువైన అక్షతలను చేల్లవలయును)*

**ఆవాహనమ్**

శ్లో॥ ఆవాహయామి విశ్వేశం జగత్సాక్షిణ మవ్యయమ్ ।
సర్వపాపహరం దేవం కరుణాపూర్ణ మానసమ్ ॥
ఓం శ్రీవరుణాయ నమః । ఆవాహయామి । *(ముందటి వలెనే)*

***ఆసనమ్***

శ్లో॥ ఆసనం పరమం దివ్యం నవరత్న సమన్వితమ్ ।
సౌవర్ణ ప్రభసంయుక్తం ముక్తా ప్రాలంబశోభితమ్ ॥

ఓం శ్రీవరుణాయ నమః । ఆసనం సమర్పయామి । *(ముందటి వలెనే)*

***పాద్యమ్***

శ్లో॥ గఙ్గాది సర్వతీర్థేభ్యః ఆనీతం నిర్మలం జలైః ।
పాద్యం గృహాణ దేవేశ సర్వాభీష్ట ఫలప్రద ॥

పాదయోః పాద్యం సమర్పయామి । *(పూజా కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి వరుణ కలశమునకు చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

***అర్ఘ్యమ్***

శ్లో॥ గఙ్గాజలం సమానీతం దివ్యగన్ధై స్సువాసితమ్ ।
అర్ఘ్యం గృహాణ భగవన్ సర్వపాపం వ్యపోహతు ॥

ఓం శ్రీవరుణాయ నమః । హస్తయోః అర్ఘ్యం సమర్పయామి । *(ముందటి వలెనే)*

***శుద్ధాచమనీయమ్***

శ్లో॥ ఆచమ్యతాం మయాదత్తం సర్వపుణ్యా నదీజలమ్ ।
గృహీత్వాఽచమనం దేవ సర్వపాప నికృంతన ॥

ఓం శ్రీవరుణాయ నమః । ముఖే శుద్ధాచమనీయం సమర్పయామి । *(ముందటి వలెనే)*

***మధుపర్కమ్***

శ్లో॥ శర్కరా దధిసంయుక్తం మధుపర్క మిదం ప్రభో ।
అహం దాస్యామి దేవేశ గృహాణ సురసత్తమ ॥

ఓం శ్రీవరుణాయ నమః । మధుపర్కం సమర్పయామి ।

***పఞ్చామృత స్నానమ్***

శ్లో॥ స్నానం పఞ్చామృతైర్దివ్యైః గన్ధాఢ్యై స్సలిలోదకైః ।
నారికేళోదకై రిక్షురసైః కురు దయానిధే ॥

ఓం శ్రీవరుణాయ నమః । పఞ్చామృత స్నానం సమర్పయామి ।

***ఔపచారిక స్నానమ్***

శ్లో॥ గఙ్గా గోదావరీ కృష్ణా యమునా నర్మదా జలైః ।

కావేరీ సిన్ధుజై శ్చైవ స్నానం కురు మహామతే ॥
ఓం శ్రీవరుణాయ నమః । ఔపచారిక స్నానం సమర్పయామి ।

**మం ॥ ఓం ఆపోహిష్ఠామ యోభువః । .. .. ఆపో జనయ థాచనః ।**

*(తములపాకుతో కలశములోని జలమును వరుణకలశమువైన చిలుకరించే వలయును)*
స్నానానన్తరంశుద్ధాచమనీయం సమర్పయామి । *(పూజా కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి వరుణ కలశమునకు చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

**వస్త్రమ్**

శ్లో॥ వస్త్రయుగ్మం సదా శుభ్రం మనోహరమిదం శుభమ్ ।
దదామి దేవదేవేశ శక్త్యైవం ప్రతిగృహ్యతామ్ ॥

**మం ॥ యువం వస్త్రాణిపీ వసావసాథే యువోరచ్ఛిద్రామన్తవో హసర్గాః ।**
**అవాతిరత మనృతాని విశ్వర్తేన మిత్రా వరుణాసచేథే ॥**

ఓం శ్రీవరుణాయ నమః । వస్త్రయుగ్మం సమర్పయామి । వస్త్రార్థం అక్షతాన్ సమర్పయామి ।
*(అక్షతలను వరుణ కలశము మీద చేల్లవలయును)*

***యజ్ఞోపవీతమ్***

శ్లో॥ స్వర్ణయజ్ఞోపవీతాని నానారత్నమయానిచ ।
ఉపవీతాని దాస్యామి గృహ్యతాం త్రిదివేశ్వర ॥

**మం ॥ యజ్ఞోపవీతం .. .. .. బలమస్తు తేజః ॥**

ఓం శ్రీవరుణాయ నమః । సువర్ణ యజ్ఞోపవీతం సమర్పయామి.
యజ్ఞోపవీతార్థం అక్షతాన్ సమర్పయామి । *(ముందటి వలెనే)*

***శ్రీగంధమ్***

శ్లో॥ గన్ధకర్పూర సంయుక్తం కుఙ్కుమాగరు సంయుతమ్ ।
విలేపనం మయాదత్తం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥

**మం ॥ గన్ధద్వారాన్దురా .. .. మిహోపహ్వయే శ్రియమ్ ॥**

ఓం శ్రీవరుణాయ నమః । శ్రీగంధం ధారయామి ।
*(తడి చన్దనమును వరుణ కలశము పైన చిలుకరించవలయును)*

***అక్షతాన్***

శ్లో॥ అక్షతోఽసి స్వభావేన భక్తానా మక్షతం పదమ్ ।
దదాసి నాథ మద్దత్తై రక్షతైః ప్రతిగృహ్యతామ్ ॥

**మం ॥ ఓం ఆయనే తేపరాయణే .. .. .. గృహాఇమే ॥**

ఓం శ్రీవరుణాయ నమః । అక్షతాన్ సమర్పయామి ।

***పుష్పాణి***

శ్లో॥ మల్లికా మాలతీ పుష్పైః చంపకైర్వకుళై శ్శుభైః ।
సర్వ పాపక్షయార్థాయ యుష్మత్పూజాం కరోమ్యహమ్ ॥

ఓం శ్రీవరుణాయ నమః । పుష్పైః పూజయామి । *(వరుణ కలశము పైన పూలను చేల్లవలయును)*

ఓం వరుణాయ నమః । ఓం అప్పతయేనమః । ఓం ఉద్దామాయ నమః । ఓం నక్రవాహనాయ నమః । ఓం పాపనాశకాయ నమః । ఓం యాదసామ్పతయే నమః । ఓం ప్రచేతాయ నమః । ఓం నాగపాశహస్తాయ నమః । ఓం అగ్నిముఖాయ నమః । ఓం అభోగ ఛత్రధరాయ నమః । ఓం పుష్పగిరి వాసాయ నమః । ఓం మిత్రాయ నమః । ఓం చతుర్ముఖాయ నమః । ఓం పశ్చిమ దిక్పతయే నమః । ఓం సహస్రాక్షాయ నమః । ఓం వర్షర్తునాథాయ నమః । ఓం పర్జన్యాయ నమః । ఓం నీలపురుషాయ నమః । ఓం కశ్యపాత్మజాయ నమః । ఓం పరఞ్జయాయ నమః । ఓం హృష్టాయ నమః । ఓం రక్తౌఘద్యుతి విగ్రహాయ నమః । ఓం ఆదిత్యాయ నమః । ఓం శశాఙ్క ధవళాయ నమః ।

ఓం శ్రీవరుణాయ నమః । నానా విధ పరిమళ పుష్పాణి సమర్పయామి ।

***ధూపమ్***

శ్లో॥ వనస్పత్యుద్భవై ర్దివ్యై ర్నానాగన్ధైస్సుసంయుతః ।
ఆఘ్రేయ స్సర్వదేవానాం ధూపోఽయం ప్రతిగృహ్యతామ్ ॥

ఓం శ్రీవరుణాయ నమః । ధూపమాఘ్రాపయామి ।

*(రెండు అగరువత్తులను లేదా సాంబ్రాణిని వెలిగించి, ఆ ధూపమును చేతితో వరుణ కలశముపైకి మరల్పవలయును)*

**దీపమ్**

శ్లో॥ సాజ్యం త్రివర్తిసంయుక్తం వహ్నినాయోజితం ప్రియమ్ ।
గృహాణ మఙ్గళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్ ॥

ఓం శ్రీవరుణాయ నమః । దీపం దర్శయామి ।

*(ఆవునేతితో మూడువత్తులను వేసి వెలిగించి వరుణ కలశమునకు చూపవలయును. లేదా కర్పూర దీపమును చూపించేవచ్చును.*

శ్లో॥ కర్పూరవాసితం యుక్తం కాంస్యపాత్ర స్థితం శుభమ్ ।
గృహాణ మఙ్గళం దీపం త్రైలోక్య తిమిరాపహమ్ ॥)

ధూపాఘ్రాణ దీప దర్శనానన్తరం ఆచమనీయం సమర్పయామి ।

*(ఉద్ధరణితో నీటిని వరుణ కలశమునకు చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

**నైవేద్యమ్**

శ్లో॥ నైవేద్యం షడ్రసోపేతం మాషాఽపూప సమన్వితమ్ ।
కదళీ నారికేళైశ్చ ఫలైరిక్షు సముద్భవైః ॥

*(ఒక కొబ్బరికాయను కొట్టి ఆ రెండు చిప్పలను వరుణ కలశమునకు నైవేద్యముగా పెట్టవలయును. కాని సందర్భములో రెండు అరటిపండ్లు లేదా మరేవయినా రెండు పండ్లను నైవేద్యముగా పెట్టవచ్చును)*

*(పురాణోక్తం:*
*పుణ్డరీకాక్ష గోవిన్ద వాసుదేవ జనార్దన ।*
*మయార్పితమిదం ద్రవ్యం పవిత్రం కురు సర్వదా ॥*
*ప్రోక్ష్య, పరిషిచ్య, నమోనమ శ్రీ పుణ్డరీకాక్ష పుణ్డరీకాక్షాయ నమః ।*
*ఓం శ్రీవరుణాయ నమః । నారికేళశకలే నివేదయామి । ప్రాణాయ నమః ।*
*...సమానాయ నమః । మధ్యేమధ్యే పానీయం సమర్పయామి ।*
*ఉత్తరాపోశనం సమర్పయామి ।)*

**మం ॥ ఓం భూర్భువస్సువః । ......అమృతోపస్తరణమసి ।**

ఓం శ్రీవరుణాయ నమః । నారికేళ శకలే నివేదయామి ।

*(ఒక చిప్ప ఐతే "శకలం", రెండయితే "శకలే", మూడు లేదా అంతకంటే ఎక్కువ ముక్కలైతే "శకలాని" అనాలి. అలాగే ... కదళీఫలం, ... ఫలే, ... ఫలాని కూడా)*

**మం ॥ ఓం ప్రాణాయ స్వాహా ।...ఓం సమానాయ స్వాహా ।**

మధ్యేమధ్యే పానీయం సమర్పయామి ।
*(పూజా కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి వరుణ కలశమునకు చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

**మం ॥ అమృతాపిధానమసి ।**

ఉత్తరాపోశనం సమర్పయామి । *(పూజా కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి వరుణ కలశమునకు చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*
హస్తౌ ప్రక్షాళయామి । *(ముందటి వలెనే)* పాదౌ ప్రక్షాళయామి । *(ముందటి వలెనే)* ముఖే శుద్ధాచమనీయం సమర్పయామి । *(ముందటి వలెనే)*

**తామ్బూలమ్**

శ్లో॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీదళైర్యుతమ్ ।
ముక్తాచూర్ణ సమాయుక్తం తామ్బూలం ప్రతిగృహ్యతామ్ ॥

ఓం శ్రీవరుణాయ నమః । తామ్బూలం సమర్పయామి ।
*(పూగీఫలము, లవఙ్గము, ఏలకులు, పచ్చకర్పూరము మొదలుగా గల తాంబూల ద్రవ్యములతో ఐదు లేత తములపాకుల తాంబూలమును సమర్పించవలయును)*
తామ్బూలచర్వణానన్తరం ఆచమనీయం సమర్పయామి ।
*(నీటిని ఉద్ధరణితో వరుణ కలశమునకు చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

***నీరాజనమ్***

*(హారతిపాత్రలో తగినంత కర్పూరమును వేసి వెలిగించి హారతిగా చూపవలెను)*

శ్లో॥ నీరాజనం సమానీతం కర్పూరేణ సమన్వితమ్ ।
తుభ్యం దాస్యామ్యహం దేవం ప్రీత్యర్థం ప్రతిగృహ్యతామ్ ॥

**మం ॥ హిరణ్యపాత్రం మధోః .. .. మాసగ్ం సృజామసి ॥**

ఓం శ్రీ వరుణదేవాయ నమః । కర్పూర ఆనన్దనీరాజనం దర్శయామి ।
నీరాజ దర్శనానన్తరం ఆచమనీయం సమర్పయామి ।
*(పూజా కలశములోని నీటిని ఉద్ధరణితో వరుణకలశమునకు చూపి ఒక పాత్రలోకి విడువవలయును. కర్త, పరివారము అందరూ నీరాజనమును భక్తితో నమస్కరించి కనులకు అద్దుకొనవలయును)*

## మన్త్రపుష్పమ్

*(కుడి అరచేతిలోకి ఒక పుష్పమును, ఒక నాణెమును తీసికొని, లేచి నిలబడి, ఎడమ అరచేతిలో కుడి అరచేతిని ఉంచి ఈ క్రింది మన్త్రపఠనము పూర్తి అయిన పిమ్మట వరుణ కలశమునకు సమర్పించవలయును)*

**మం ॥ ఓం రాజాధిరాజాయ .. .. ఓం తత్పురోర్నమః ॥**

ఓం శ్రీ వరుణదేవాయ నమః । సువర్ణ దివ్యమన్త్రపుష్పం సమర్పయామి ।

*(పుష్పము, నాణెములను వరుణ కలశమునకు సమర్పించవలయును)*

శ్లో॥ వరుణాయ నమస్తుభ్యం ప్రతీచ్యాం పతయేనమః ।
అపాంపతే శోభనాని ప్రవృద్ధింఙ్కురు మే ప్రభో ॥

ఓం వరుణదేవాయ నమః । నమస్కారాన్ సమర్పయామి ।

*(నమస్కరించవలయును)*

శ్లో॥ యస్య స్మృత్యాచ నామోక్త్యా తపో పూజా క్రియాదిషు ।
న్యూనం సమ్పూర్ణతాం యాతి సద్యో వన్దే అపాంపతిమ్ ॥
మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం పశ్చిమేశ ।
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే ॥

అనయా ధ్యానాఽవాహనాది షోడశోపచారపూజయాచ భగవాన్ సర్వాత్మకః శ్రీ వరుణదేవః సుప్రీతః సుప్రసన్నో వరదో భవతు ।

*(ఉద్ధరణిలోని నీటిని కుడిఅరచేతిలోకి పోసికొని, వ్రేళ్ళమీదుగా క్రిందికి పాత్రలోకి విడువవలయును)*

మమ (యజమానస్య) వరుణదేవతా ప్రసాదసిద్ధిరస్తు ।

శ్రీ వరుణదేవతా ప్రసాదం శిరసాగృహ్ణాతు । *(బ్రహ్మ గారు కర్తకూ, ఇతర పరివారమునకూ పూజాక్షతలను శిరముపైన వేయవలయును)*

శ్రీ వరుణదేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి । *(పూజాక్షతలను వేయించు కుంటున్నప్పుడు లేదా వేసుకుంటున్నప్పుడు కర్త, పరివారము చెప్పుకొన వలయును)*

### *విహిత మణ్డపారాధనమ్ ।*

శ్లో॥ విఘ్నేశః *పద్మజో* విష్ణుః మహాదేవశ్చ పార్వతీ ।
ఆదిత్యాది గ్రహాస్సర్వే శక్రాద్యష్ట దిగీశ్వరాః ॥

అత్రాఙ్గ దేవతాః ప్రోక్తా స్తస్మాదగ్రే ప్రపూజయేత్ ।
అగ్రతః కలశే దేవం వరుణం పృథగర్చయేత్ ॥

గణేశప్రభృతీన్పఞ్చ కలశస్యోత్తరే న్యసేత్ ।
తత్తన్మన్త్రైః ప్రాక్సమాప్త్యా పూజనీయాః ప్రయత్నతః ॥

కలశస్యతు పశ్చాద్యైః గ్రహాస్సూర్య పురస్సరాః ।
ఉదక్సమాప్త్యా సంస్థాప్య పూజనీయాః ప్రయత్నతః ॥

పూర్వాది దిక్షుచేన్ద్రాదీ న్పూజయే చ్ఛుద్ధమానసః ।
తతో నారాయణం దేవం కలశే పూజయేత్సుధీః ॥

తథాచ దుర్గా గణపతి క్షేత్రపాలక వాస్తుపురుషాభయఙ్కర మృత్యుఞ్జయాది సర్వాన్ దేవాన్, సర్వాః దేవతాశ్చ కలశస్యోత్తరతః ప్రాక్సమాప్త్యావాహ్య ।
*(పద్మజః=బ్రహ్మ; "పద్మజా"(లక్ష్మి) అను తప్పు పాఠముతో కొంతమంది లక్ష్మీదేవిని పూజిస్తున్నారు. అది సరి కాదు)*

***పఞ్చలోకపాలకావాహనమ్ ।***

మమ (యజమానస్య) సర్వారిష్ట పరిహారద్వారా ఆయుష్యాభివృధ్యర్థం శ్రీ రమాసహిత సత్యనారాయణ వ్రతాఙ్గత్వేన గణపత్యాది పఞ్చ లోకపాల కావాహనఙ్కరిష్యే ।
*(కుడిచేతి వ్రేళ్ళతో నీటిని తాకవలయును)*

శ్లో॥ హే హేరమ్బ త్వమేహ్యేహి అమ్బికా త్ర్యమ్బకాత్మజ ।
సిద్ధిబుద్ధిర్యుత త్ర్యక్ష సర్వలోకపితః పితః ॥
నాగాస్య నాగహారత్వం గణనాథం చతుర్భుజమ్ ।
భూషితస్స్వాయుధైర్దివ్యైః పాశాఙ్కుశ పరస్వధైః ॥
విఘ్నేశ్వరమహం వన్దే చిన్తితార్థ ప్రదాయకమ్ ।
శైలాత్మజా సుతం దేవం నిర్విఘ్నార్థం గణాధిపమ్ ॥

**మం ॥ ఓం గణానాంత్వా గణపతిగ్ం హవామహే కవిఙ్కవీనా ముపమశ్ర వస్తమమ్ । జ్యేష్ఠ రాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆన శ్శృణ్వన్నూ తిభి స్సీదసాదనమ్ ॥**

ఓం గం గణపతయేనమః । సాఙ్గం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివారసమేతం గణపతిం లోకపాలక మావాహయామి స్థాపయామి పూజ యామి । *(ఐదు తాజా తములపాకులు, ఒక పోకచెక్క, సువర్ణము లేదా బదులుగా పదిరూపాయల నాణెము, ఒక ఎండుఖర్జూరము, రెండు అరటిపండ్లు లేదా ఒక మంచి కొబ్బరికాయ, రెండుపూవులు కల తాంబూలమును పీఠము మీద, ఉత్తరపు భాగములో, పశ్చిమము నుంచి తూర్పు సమాప్తిగా మిగతా లోకపాలకులకు కూడా చోటు ఉండే విధముగా, తాంబూలపు కొసలు తూర్పు వైపుగా ఉండేటట్లుగా భక్తి ప్రపత్తులతో ఆహ్వానిత లోకపాలకుని తలంచుకొంటూ ఉంచేవలయును. పీఠము బొమ్మ చూడుము)*

శ్లో॥ బ్రహ్మాణం రక్త గౌరాఙ్గం చతుర్వక్త్రం జగత్ప్రభుమ్ ।
అక్షస్రుక్కుణ్డికాఽభీతి వరపాణిం విచిన్తయేత్ ॥

**మం ॥ ఓం బ్రహ్మా దేవానాం పదవీః కవీనా మృషిర్విప్రాణాం మహిషో మృగాణామ్ । శ్యేనో గృధ్రాణాగ్ స్వధితిర్వనానాగ్ం సోమః పవిత్రమత్యేతిరేభన్ ॥**

ఓం బ్రహ్మణే నమః । సాఙ్గం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం బ్రహ్మాణం లోకపాలక మావాహయామి స్థాపయామి పూజయామి । *(తాంబూలమును ఇంతకుముందు ఉంచిన దానికి తూర్పు దిక్కున ఒక అంగుళము దూరముగా ఉంచేవలయును)*

శ్లో॥ గరుత్మద్వాహనారూఢం శఙ్ఖచక్రధరం హరిమ్ ।
పీతామ్బరం హృదిధ్యాయేత్ సర్వాభీష్టస్య సిద్ధయే ॥

**మం ॥ ఓం ఇదం విష్ణుర్విచక్రమే త్రేధా నిదధే పదమ్ ।**
**సమూఢమస్యపాగ్ం సురే ॥**

ఓం విష్ణవే నమః । సాఙ్గం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం విష్ణుం లోకపాలక మావాహయామి స్థాపయామి పూజయామి । *(తాంబూలమును ఇంతకుముందు ఉంచిన దానికి తూర్పు దిక్కున ఒక అంగుళము దూరముగా ఉంచేవలయును)*

శ్లో॥ జ్వాలమాలావృతం రుద్రం వహ్నిమణ్డల మధ్యగమ్ ।
ధ్యాయేత్కళాదశయుతం శక్తిస్వస్తిక ధారిణమ్ ॥

**మం ॥ ఓం కద్రుద్రాయ ప్రచేతసే మీఢుష్టమాయ తవ్యసే ।**

**వోచేమశన్తమగ్ం హృదే ॥**

ఓం రుద్రాయనమః । సాఙ్గం సాయుధం సవాహనం సశక్తి పత్నీపుత్ర పరివార సమేతం రుద్రం లోకపాలక మావాహయామి స్థాపయామి పూజయామి ।
*(తాంబూలమును ఇంతకుముందు ఉంచిన దానికి తూర్పు దిక్కున ఒక అంగుళము దూరముగా ఉంచేవలయును)*

శ్లో ॥ ఆగచ్ఛ త్వం మహాదేవి సర్వ మఙ్గళదాయిని ।
భక్తి శ్రద్ధా సమాయుక్తః ధ్యాయామి శివవల్లభే ॥

**మం ॥ ఓం గౌరీమిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీ సాచతుష్పదీ ।**

**అష్టాపదీ నవపదీ బభూవుషీ సహస్రాక్షరా పరమే వ్యోమన్ ॥**

ఓం గౌర్యైనమః । సాఙ్గాం సాయుధాం సవాహనాం సశక్తి భర్తృపుత్ర పరివార సమేతాం గౌరీం లోకపాలికా మావాహయామి స్థాపయామి పూజయామి ।
*(తాంబూలమును ఇంతకుముందు ఉంచిన దానికి తూర్పు దిక్కున ఒక అంగుళము దూరముగా ఉంచేవలయును)*
ధ్యానావాహనాది పూజాం కేచిత్కుర్వంతి । *(కుడిచేతిలోకి అక్షతలను తీసికొని ...)*

**మం ॥ ఓం అసునీతే .. .. .. ముపహ్వయతే ॥**

(శ్లో॥ శిరః శ్రోత్రం తథా నాసామోష్ఠం జిహ్వాం తథైవచ ।
కణ్ఠం కుక్షిఞ్చ హృదయం కటి బాహూ తథాఙ్గుళీన్ ।
ఊరూ జానూచ పాదాన్తం తత్తం న్యాసం వినిర్దిశేత్ ।)

గణేశాది పఞ్చలోకపాలక దేవతాభ్యోనమః । స్థిరోభవ । .. .. స్థిరాసనఙ్కురు ।
*(తాంబూలముల పైన అక్షతలను చేల్లవలయును)*
గణేశాది పఞ్చలోకపాలక దేవతాభ్యోనమః ।

ధ్యాయామి । *(అక్షతలను చేల్లవలయును)* ఆవాహయామి । *(అక్షతలను చేల్లవలయును)* ఆసనం సమర్పయామి । *(అక్షతలను చేల్లవలయును)* పాదయోః పాద్యం సమర్పయామి । *(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును)* హస్తయోః అర్ఘ్యం సమర్పయామి । *(ముందటి వలెనే)* ముఖే శుద్ధాచమనీయం సమర్పయామి । *(ముందటి వలెనే)* ఔపచారిక స్నానం సమర్పయామి । *(తములపాకుతో కలశములోని జలమును తాంబూలములపైన చిలుకరించేవలయును)* స్నానానన్తరం శుద్ధాచమనీయం సమర్పయామి । *(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును)* వస్త్రార్థం అక్షతాన్ సమర్పయామి । *(అక్షతలను చేల్ల వలయును)* యజ్ఞోపవీతార్థం అక్షతాన్ సమర్పయామి । *(అక్షతలను చేల్ల వలయును)* శ్రీగంధం ధారయామి । *(తడి చన్దనమును పైన చిలుకరించే వలయును)* పుష్పైః పూజయామి । *(పూలను చేల్లవలయును)* ధూప మాఘ్రాపయామి । *(రెండు అగరువత్తులను లేదా సాంబ్రాణిని వెలిగించి, ఆ ధూపమును చేతితో మరల్పవలయును)* దీపం దర్శయామి । *(కర్పూరదీపమును చూపవలయును)* నైవేద్యం సమర్పయామి । *(ఒక కొబ్బరికాయను కొట్టి ఆ రెండు చిప్పలను నైవేద్యముగా పెట్టవలయును. కాని సందర్భములో రెండు అరటిపండ్లు లేదా మరేవయినా రెండు పండ్లను నైవేద్యముగా పెట్టవచ్చును)*

*(పురాణోక్తం:*

*పుణ్డరీకాక్ష గోవిన్ద వాసుదేవ జనార్దన ।*

*మయార్పితమిదం ద్రవ్యం పవిత్రం కురు సర్వదా ॥*

*ప్రోక్ష్య, పరిషిచ్య, నమోనమ శ్రీ పుణ్డరీకాక్ష పుణ్డరీకాక్షాయ నమః ।*

*గణేశాది పఞ్చలోకపాలక దేవతాభ్యోనమః । నారికేళశకలే నివేదయామి ।*

*మం ॥ ప్రాణాయ నమః । ...సమానాయ నమః ।*

*మధ్యేమధ్యే పానీయం సమర్పయామి । ఉత్తరాపోశనం సమర్పయామి ।)*

**మం ॥ ఓం భూర్భువస్సువః । ......అమృతోపస్తరణమసి ।**

గణేశాది పఞ్చలోకపాలక దేవతాభ్యోనమః । నారికేళశకలే నివేదయామి ।

**మం ॥ ఓం ప్రాణాయ స్వాహా ।...ఓం సమానాయ స్వాహా ।**

మధ్యేమధ్యే పానీయం సమర్పయామి ।

*(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును)*

**మం ॥ అమృతాపిధానమసి ।**

ఉత్తరాపోశనం సమర్పయామి । *(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును)* హస్తౌ ప్రక్షాళయామి । *(ముందటి వలెనే)* పాదౌ ప్రక్షాళయామి । *(ముందటి వలెనే)* ముఖే శుద్ధాచమనీయం సమర్ప యామి । *(ముందటి వలెనే)* తామ్బూలం సమర్పయామి । *(తాంబూలమును సమర్పించవలయును)* తామ్బూల చర్వణానన్తరం శుద్ధాచమనీయం సమర్ప యామి । *(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువ వలయును)* కర్పూర ఆనన్దనీరాజనం దర్శయామి । *(కర్పూర హారతిని సమర్పించవలయును)* నీరాజనానన్తరం ఆచమనీయం సమర్పయామి । *(కలశములోని నీటిని ఉద్ధరణితో తీసి చూపి ఒక పాత్రలోకి విడువవలయును. కర్త, పరివారము అందరూ నీరాజనమును, భక్తితో నమస్కరించి, కనులకు అద్దుకొనవలయును)*

**మం ॥ ఓం రాజాధిరాజాయ .. .. ఓం తత్పురోర్నమః ॥**

మన్త్రపుష్పం సమర్పయామి । *(పుష్పములను సమర్పించవలయును)*
గణేశాది పఞ్చలోకపాలక దేవతాభ్యోనమః । నమస్కారాన్ సమర్పయామి ।
*(నమస్కరించవలయును)*
మమ (యజమానస్య) గణేశాది పఞ్చలోకపాలక దేవతా ప్రసాదసిద్ధిరస్తు ।
గణేశాది పఞ్చలోకపాలక దేవతా ప్రసాదం శిరసాగృహ్ణాతు । *(బ్రహ్మ గారు కర్తకూ, ఇతర పరివారమునకూ పూజాక్షతలను శిరముపైన వేయవలయును)*
గణేశాది పఞ్చలోకపాలక దేవతా ప్రసాదం శిరసాగృహ్ణామి ।
*(పూజాక్షతలను వేసుకుంటున్నప్పుడు కర్త, పరివారము చెప్పుకొన వలయును)*

### *నవగ్రహారాధనమ్ ।*

*(౧. సత్యనారాయణ వ్రతములో పీఠము మీద పశ్చిమ భాగమందు దక్షిణమున ప్రారంభించి ఉత్తర సమాప్తిగా సూర్యాది నవగ్రహములను క్రమముగా (ఆదిత్యాయచ సోమాయ మఙ్గళాయ బుధాయచ గురుశుక్ర శనిభ్యశ్చ రాహవే కేతవేనమః) ఆ గ్రహ, అధి, ప్రత్యధిదేవతా మన్త్రములను వరుసగా చెప్పి, అధిదేవతా ప్రత్యధి దేవతా సహిత ...గ్రహమావాహయామి స్థాపయామి పూజయామి అని ఒకే*

పీడితుఁడైన బ్రాహ్మణుఁని జూచి బ్రాహ్మణప్రియుఁడైన భగవానుఁడు శ్రీహరి యొక వృద్ధబ్రాహ్మణ వేషధారియై కలసి యాదరముతో నిట్లు ప్రశ్నించెను. "ఓ ద్విజసత్తమా ! నీవు నిత్యదుఃఖితుఁడవై దేని నిమిత్తమై యిట్లు దిరుగు చున్నావు? నాకు వివరముగా దెలియఁజెప్పుము". దానికి నా బీద బ్రాహ్మణుఁడు "ఓ ప్రభూ ! నే నతిదరిద్రుఁడను. కడుపును నింపుకొనుటకు భిక్షకై యీ విధముగా దిరుగుచున్నాను. యేదయినా యొక యుపాయము దెలిసినచో నాకు జెప్పఁగలరు" అని సమాధానమిచ్చినాడు. అప్పుడా వృద్ధవిప్ర వేషధారి యైన శ్రీహరి. "ఓయి బ్రాహ్మణా ! విష్ణుమూర్తి యొక్క అవతారమైన శ్రీ సత్యనారాయణమూర్తి కోరిన కోరికలనెల్లనూ తీర్చు దైవము. ఆ సత్యనారాయణస్వామిని వ్రతము జేసి పూజించుము. ఉత్తమ మైన యా వ్రతమును జేయుటవలన సర్వదుఃఖముల నుంచి మానవుఁడు విముక్తుఁడగును" అని చెప్పి సత్యనారాయణ వ్రతమును జేయు విధానమును సవివరముగ తెలియఁజెప్పి యదృశ్యమయ్యెను.

అంతట నా బీద బ్రాహ్మణుఁడు "నాకీ విప్రుఁడు జెప్పిన సత్యనారాయణ వ్రతమును రేపు తప్పకఁ జేయుదు" నని మనస్సునందు సంకల్పించుకొనెను. ఆ సంకల్పమును నెరవేర్చుకొను చింతతో నారాత్రి సరిగ నిద్దుర కూడ పట్టక, ప్రాతఃకాలముననే లేచి "ఈ రోజు సత్యనారాయణ వ్రతమును దప్పక చేసెదను" అని మరల సంకల్పించి భిక్షాటనమునకై బయలుదేరెను. ఆ రోజున నతనికి చాలా ద్రవ్యము లభించినది. బంధువులను, బ్రాహ్మణులను బిలుచుకొని వచ్చి యా బీదబ్రాహ్మణుఁడు సత్యనారాయణ వ్రతము ననుకున్న ప్రకారముగా నాచరించెను. ఆ వ్రత ప్రభావము వలన నా బ్రాహ్మణునకు సర్వదుఃఖములు నశించి, సర్వ సంపత్తులునుఁ జేకూరెను.

అది మొదలుగా నా బ్రాహ్మణుఁడు బ్రతి మాసముననను సత్యనారాయణ వ్రతమునుఁ జేసి సర్వపాపములనుంచి విముక్తుఁడగుటయే కాక చివరకు దుర్లభమైన మోక్షమునుఁ గూడ పొందెను. ఈ సత్యనారాయణ వ్రతమును నీ భూమి మీద మానవుఁ డాచరించిన వెన్వెంటనే సర్వదుఃఖములనుండి విముక్తుఁడగును. మహాత్ముఁడైన నారదమునికి శ్రీమన్నారాయణుఁడు

స్వయముగాఁ జెప్పిన యీ కథను మీకు జెప్పినాడను. యింకేమిఁ జెప్పమందురు?" యని సూతుడు తన చేటూ్ట యున్న మునుల నడిగెను.

అప్పుడు మునులు "ఓ సూత మహర్షీ! ఆ బ్రాహ్మణుని వలన నీ వ్రతమును గుఱించి తెలిసికొని మరెవరయినా ఈ వ్రతము నాచరించిన వారున్నారా? ఆ వివరములను మాకుఁ దెలియజేయఁగలరు" అనుచుఁ బ్రార్థించినారు.

అప్పుడు సూతమహర్షి యిలా చెప్పినాడు. "ఓ మునులారా! మీరడిగిన విధముగా నీ వ్రతమెవ్వరిచేతఁ జేయబడినదో వివరించెదను. ఒకనాడా బ్రాహ్మణుఁడు బంధువులతోను, స్వజనులతోను గూడి యథాశక్తిగా నీ వ్రతము జేయఁదొడగెను. ఆ సమయమునఁ గట్టెపుల్లల నమ్ముకొను యొక మనిషి యా కట్టెలను బయటనే యుంచి విప్రుని గృహములోనికి వచ్చెను. మిక్కిలి దప్పిక చేతఁ బీడింపబడుచున్ననూ బ్రాహ్మణుఁడు సేయు వ్రతము జూచి " ఓ ద్విజోత్తమా ! మీరు చేయుచున్నట్టి యీ వ్రతము నేమందురు? దీనిని జేయుటవలన వచ్చు ఫలమేమిటి? దాని నంతయును నాకు వివరించి చెప్పు" డని యడిగినాడు.

"ఓయీ యిది సత్యనారాయణ వ్రతము. దీనిఁ జేయుటవలన సర్వవాంఛలు నెఱవేరి సమృద్ధిగా ధనధాన్య సిద్ధి కలుగును" అని బ్రాహ్మణుఁడు బదులీయగా వినిన యా కట్టెల నమ్ముకొని బ్రతుకువాడు, సంతోషించి, ప్రసాదమును గ్రహించి, జలమునుఁ ద్రావి, భోజనము జేసి తన యింటికి వెళ్ళెను. మరునాటి దినమున నతడు "ఈ రోజునఁ గట్టెల నమ్మగా వచ్చిన మొత్తము ధనముతో సత్యనారాయణ వ్రతమునుఁ జేయుదు" నని మనస్సున సంకల్పించి, కట్టెలను శిరము మీదకు నెత్తుకొనెను.

ఆరోజున నతఁడు గొప్ప ధనవంతులు నివసించు ప్రాంతమునకుఁ బోయి కట్టెల నమ్మగా రెండింతలు లాభము వచ్చెను. దానితో నతడు బ్రసన్న చిత్తముతో నరటిపండ్లు, శర్కర, నేయి, పాలు మరియు గోధుమ నూకనుఁ గొని తన యింటికిఁ జేరెను. ఆ తరువాత యతఁడు బంధువుల సమక్షములో శ్రీ సత్యనారాయణ వ్రతమును జేసెను. ఆ వ్రత ప్రభావము

వలన ధనమును, బుత్త్రాదులను బొంది యిహ లోకమున సర్వసుఖముల ననుభవించి యంత్యమున సత్యలోకమును జేరెను.

ఇతి స్కాన్ద పురాణే రేవాఖణ్డే సత్యనారాయణ వ్రత కథాయాం ద్వితీయోఽధ్యాయః సమాప్తః ।

*("శ్రీ రమాసహిత సత్యనారాయణస్వామినే నమః ।" యని చేతిలోని యక్షతలను ఆకుమీద ఉంచేవలయును. పునః పూజాదికం కృత్వా. ముందటి వలెనే పునః పూజను జేయవలయును.)*

## తృతీయాధ్యాయము

*(వ్రతకర్తలు ఆకులోని యక్షతలను మరలా కుడి చేతిలోనికి తీసికొనవలయును)*

సూతమహాముని యిలా చెప్పఁ బ్రారంభించెను. "ఓ మునీశ్వరులారా! పూర్వము ఉల్కాముఖుఁడను నొక రాజు కలఁడు. అతడు జితేన్ద్రియుఁడు, సత్యవాది మరియు ననుదినమును దేవాలయ సందర్శనము జేయుచూ బ్రాహ్మణులకు ధనమునిచ్చి సంతోషపరచుచుండెడివాడు. ఆయన యొక దినమున సౌందర్యవతి, యనుకూలవతి యైన తన భార్యతో పాటు భద్రశీలా నదీ తీరమందున సత్యనారాయణ స్వామి వ్రతము నాచరించెను. అదేసమయములో సాధువు యను పేరు కలిగిన వైశ్యుడొకఁడు వర్తకము నిమిత్తము దన నావలో చాలా ధనమును, నితర వస్తువులను నింపుకొని వెళ్ళుచూ వ్రతమును జేయుచున్న రాజును చూచి, నావ నొడ్డుకుఁ జేర్చి, రాజును సమీపించి వినయముగా ప్రశ్నించినాడు. "ఓ రాజా! భక్తి యుక్తముగా నీవిప్పుడు సేయుచున్న వ్రతమును గుఱించి నాకుఁ దెలిసికొనవలెనని యున్నది. వ్రతమును గుఱించి, చేయు విధానమును, సర్వమును వివరించేఁ బ్రార్థన."

దానికి రాజు "ఓ సాధూ ! నేను సంతానార్థియై యనంత తేజోమూర్తి యైన విష్ణువును బూజించుచున్నాను" అని తెలిపెను. వినిన సాధువు "ఓ భూపతీ ! నాకునూ సంతానము లేదు. ఈ వ్రతమును జేసి నేను కూడా నిశ్చయముగా సంతానమును బొందెదను" అని పలికి రాజు చెప్పగా వ్రతమునుఁ జేయు

విధివిధానమును బూర్తిగాఁ దెలిసికొనెను. ఆ పిమ్మట సాధువు వర్తకమును బూర్తి యొనరించుకొని యానందముతో గృహమును జేరి భార్యయగు లీలావతితో యావద్విషయమును దెలియఁజెప్పి, "మనకునూ సంతానము గలిగినచో సెస్వెంటనే వ్రతమును జేయుదము" అని నిశ్చయమును వెల్లడించెను.

భార్యయైన లీలావతి గృహస్థ ధర్మములను జక్కగా నెరవేర్చుచూ ధర్మపరాయణురాలై భర్తతో నానందముగ కాలము గడుపుచూ కాలక్రమమున సత్యనారాయణ స్వామి యనుగ్రహము వలన గర్భవతి యైనది. పదియవ మాసమున నొక యాడశిశువును బ్రసవించినది. శుక్లపక్ష చంద్రుని వలె దిన దిన ప్రవర్ధమానమగుచున్న నా కుమార్తెకు కళావతి యని బేరిడిరి. ఒకనాడు లీలావతి భర్తతో "మనకు సంతానఫలము లభించినది. సంకల్పించిన ప్రకారముగా సత్యనారాయణ వ్రతమును జేయుట విధి కదా! యెందువలనఁ బూనుకొనుట లేదు?" అని బ్రశ్నించినది. దానికి సాధువు "ప్రియా! అమ్మాయి వివాహ సమయమున వ్రతమును జేయుదు" మని యామెను సమాధానపరచి వాణిజ్య నిమిత్తము బట్టణమునకు నేగెను.

కళావతి తండ్రి యింట దినదిన ప్రవర్ధమానమగుచు యుక్తవయస్కురాలయ్యెను. సాధువు నగరములోని దన స్నేహితులతో సమాలోచించి కళావతికిఁ దగిన వరుని వెదకుటకై యొక దూతను నియోగించెను. ఆ దూత తగిన వరునికై విచారించుచూ కాంచన నగరమున నొక యనుకూల మైన వైశ్యకుమారునిఁ జూచి యతనిని సాధువు వద్దకు దోడ్కొని వచ్చెను. సాధువు సుందరుఁడు, గుణోపేతుఁడయిన యా వణిక్పుత్రునకుఁ గళావతి నిచ్చి విధి విధానముగా వివాహము జేసెను. కానీ దుర్భాగ్యవశాత్ సత్య నారాయణ వ్రతమును జేయుట మరచెను. తత్కారణమున సత్య నారాయణ స్వామికి యాగ్రహము గలిగెను. వివాహానంతరము దన కులవృత్తి యైన వర్తకములో నిష్ణాతుఁడగు సాధువు, యల్లునిఁ గూడ తోడ్కొని వ్యాపారమును జేయుటకై సముద్రము మీద నావలో బయలు దేరెను. చంద్రకేతు మహారాజుచేఁ బరిపాలింపబడుచున్న రమ్యమైన రత్నసానుపురమను నొక సముద్రతీర పట్టణమును జేరి, నావను తీరమున

విడచి యా పట్టణములో వ్యాపారమును జేయ మొదలిడెను. ఆ సమయమున సత్యనారాయణస్వామి కోపించి, భ్రష్ట ప్రతిజ్ఞుఁడైన సాధువును దారుణమైన కఠినమైన మహాదుఃఖమును బొందునటుల శపించెను. ఆ దినమున దొంగలు గొందరు చంద్రకేతు మహారాజు ధనాగారమునుంచి కొంత ధనమును దొంగిలించి, తమను దరుముకొని వచ్చుచున్న రాజభటులను జూచి భయపడి, సాధువు వర్తకమును జేయుచున్న ప్రదేశమునకు వచ్చి యా ధనము నచ్చట జారవిడచి పారిపోయిరి. తరుముచున్న రాజభటులు రాజుగారి ధనమును సజ్జనుడగు సాధువు, యతని యల్లుఁడు యున్న ప్రదేశముననే యుండుట జూచి, వారినే దొంగలని భ్రమించి, యిరువురనూ బంధించి చంద్రకేతు మహారాజు వద్దకు దీసికొని పెళ్ళిరి. రాజుతో "ధనముతో సహా ఇరువురు తస్కరులను బంధించి తెచ్చితిమి. తమ యాజ్ఞకొరకు పేచియున్నాము" అనిరి. అంతట రాజు నిజానిజములను విచారింపకయే వారిరువురనూ ధృడముగా కారాగారములో బంధించుటకు నాజ్ఞనిచ్చెను. సత్యదేవుని మాయ వలన సాధువు యతని యల్లుని మాటలను వినిపించుకొననేలేదు. వారి ధనమునంతయును జంద్రకేతు మహారాజుగారి ధనాగారములోకి జేర్చిరి.

స్వామి శాపకారణముగా సాధువు యొక్క యింటి వద్ద కూడ నందరూ దుఖవశులైరి. ఇంటనున్న ధనాదికమును దొంగలు దోచుకొని పోయిరి. లీలావతి, కళావతి యాకలిదప్పులకు, వ్యాధులకు లోనై, యింటింటికీ తిరిగి బిచ్చెమెత్తుకొని జీవింపసాగిరి. కళావతి భిక్షాటనమును జేయుచు నొక దినమున క్షుధార్తితో నొక బ్రాహ్మణ గృహమునకు పెళ్ళినది. అక్కడ సత్యనారాయణ వ్రతము జరుగుచున్నది. తానుకూడా యక్కడనే యుండి యా వ్రతమునంతయును సావధానముగా తిలకించి, కథాశ్రవణమును జేసి, ప్రసాదమును భుజించి రాత్రిపేళకు నింటికి జేరినది. లీలావతి కుమార్తెను జూచి ప్రేమతో "అమ్మా! యింత యాలస్యముగ రాత్రిపేళ యింటికి చేరినావు. నీకీమీ చెడు యాలోచనలు గలుగుటలేదు కదా" యని యాందోళనతో బ్రశ్నించినది. దానికి కళావతి తల్లితో దాను బ్రాహ్మణుని యింట, చూచినంతనే వాంఛితార్థసిద్ధినిఁ గలిగించే సత్యనారాయణ వ్రతమును

జూచివచ్చిన పైనమును దెలిపినది. కుమార్తె పలికిన మాటలు వినిన లీలావతికిఁ దాము సత్యనారాయణ వ్రతమును జేయమరచిన సంగతి జ్ఞాపకమునకు వచ్చినది. ఆమె వెంటనే స్వజనులతోను, బంధువులతోను కలిసి యథాశక్తిగా సత్యనారాయణ వ్రతమును జేసినది. తన భర్తను, నల్లుని క్షమించి వారిని క్షేమముగా నింటికిఁ జేర్చుమని యా స్వామినిఁ బ్రార్థించినది. లీలావతి యొనరించిన వ్రతమునకు సంతుష్టుఁడైన సత్యనారాయణ స్వామి చంద్రకేతు రాజునకు స్వప్నములోఁ గనుపించి "ఓ రాజా! నీవు బంధించిన వణిక్కులు, సాధువును నతని యల్లుఁడును నిర్దోషులు. వారిని వెంటనే బంధవిమోచనులను జేసి వారి ధనము నంతయును సంపూర్ణముగా వారికి నిచ్చివేయుము. అట్లుఁ జేయకున్నచో నిన్ను, నీ రాజ్యమును, ధనమును, పుత్రులను నశింపఁజేతును" యని యానతిచ్చెను. రాజు నిద్ర లేచిన పిమ్మట నా విషయమును ధ్యానించు చున్నప్పు డెల్లనూ భగవంతుడు గనుపించుచుండెను.

ఉదయము కాగానే రాజు లేచి స్వజనులందరితో గూడి సభామధ్యమున దన స్వప్న వృత్తాంతమును దెలియఁజెప్పి, భటులను పిలిచి బంధింపబడియున్న సజ్జనులైన యా వైశ్యద్వయమును విడుదల చేసి తీసికొని రమ్మని యాజ్ఞాపించెను. రాజాజ్ఞానుసారముగా భటులు సాధువుని నతని యల్లునిని బంధవిముక్తులను గావించి వినయముతో రాజుగారి వద్దకు దోడ్కొనివచ్చిరి. సాధువు మరియు యతని యల్లుఁడును బూర్వ వృత్తాంత మంతయును స్మరించుకొనుచూ తమకింకేమి యాపదలు రానున్నవో యని భయవిహ్వలులై చంద్రకేతు మహారాజు యెదుట నిలువబడిరి. రాజు వారిని జూచి "మీకుఁ గలిగిన యాపదలు, దుఃఖములు భగవన్నిర్దేశితములు. మీరిక భయమునుఁ జెందునవసరము లేదు" యని యాదరముగా బలికెను. పిమ్మట వారిరువురకు క్షురకర్మ, మంగళస్నానములను జేయించి వస్త్రాలంకారములను బహూకరించి తన చెంతనే కూరుచుండబెట్టి మంచి మాటలతో వారిని సంతోషపరచెను. ఆపై వారినుంచి స్వాధీనపరచుకొనిన ధనమునకు రెట్టింపు ధనమును బహూకరించి వారు తమ స్వంత యూరికి

వెళ్ళుటకై యనుజ్ఞ నిచ్చెను. సాధువు యతని యల్లుఁడును సంతోషముతోఁ దమ స్వగ్రామమునకు బయలుదేరిరి.

ఇతి శ్రీ స్కాన్దపురాణే రేవాఖణ్డే శ్రీ సత్యనారాయణ వ్రతకథాయాం తృతీయోఽధ్యాయః సమాప్తః ।
*("శ్రీ రమాసహిత సత్యనారాయణస్వామినే నమః ।" యని చేతిలోని యక్షతలను ఆకుమీద ఉంచేవలయును. ముందటి వలెనే పునః పూజను జేయవలయును.)*

## చతుర్థాధ్యాయము

*(వ్రతకర్తలు ఆకులోని యక్షతలను మరలా కుడి చేతిలోనికి తీసికొనవలయును)*
సూతమహర్షి శౌనకాది మహర్షులకు మరల కథ చెప్పఁ బ్రారంభించెను.
ఆ విధముగా చంద్రకేతు మహారాజు వద్ద నుంచి బంధవిముక్తులైన సాధువు మరియు నతని యల్లుఁడును బ్రాహ్మణులకు ధనదానముఁ జేసి తమ నగరమునకుఁ బోఁదొడగెను.

అయితే మరల వారినిఁ బరీక్షించేదలచిన సత్యనారాయణ స్వామి యొక సన్యాసి రూపములో వారివద్దకు వచ్చి "మీనావలో నేమున్న" దని ప్రశ్నించెను. ఆ సన్యాసినిఁ జూచి ధనమదముతోఁ జులకనగా "ఓ దండ కమండలధారీ! మా నావ యందేమున్న నీకేలనయ్యా? ధనమును సంగ్రహింతువా యేమి? అందులో నాకులు, తీగలు మాత్రమే యున్నవి. వాటితోనే వ్యాపారమును జేయుచున్నా"మని సాధువు హేళనగా సమాధానమిచ్చెను. అది వినిన సన్యాసి రూపమున నున్న స్వామి "అట్లే యగు గాక!" యని పలికి సముద్ర తీరమునకుఁ బోయి యచట నాసీనుడయ్యెను. తన నిత్యకృత్యములను నెరవేర్చుకొనిన సాధువు తమ నావ తేలియుండుటను జూచి విస్మయ మందెను. అందులో ధనమునకు బదులుగా నాకులు, లతలు యుండుట చూచి సాధువు మరియు నతని యల్లుఁడును మూర్ఛిల్లిరి. తెలివి వచ్చిన పిమ్మట మిక్కిలి దుఃఖముతోఁ జింతింపసాగిరి. తీవ్రదుఃఖోపేతుడై యున్న తన మామను జూచి యల్లుఁడు యిలా పలికెను. "అనవసరముగా ఏల శోకింతురు? ఇది యంతయు నా సన్యాసి వాక్ఫలము. ఇప్పుడేమిఁ జేయ

వలయుననన్ననూ శక్తిమంతుడైన యాయనకే సాధ్యము. వెళ్ళి యాయనను శరణము వేడుదము".

అల్లుని మాటలను విన్న సాధువు వెంటనే యా సన్యాసిని సమీపించి భక్తితో సాదరముగా ప్రణమిల్లి, "నా వలన నపరాధము జరిగినది. మన్నింపుడు" అని పరిపరి విధముల శోకించెను. మహాశోకముతో విలపించుచున్న సాధువుతో నా సన్యాసి " ఓ సాధూ! దుఃఖించకుము. నేనుఁ జెప్పునది వినుము. నన్నుఁ బూజింతునని సంకల్పించి వ్రతముఁ జేయుట మరచి నందువలన నా యాజ్ఞ వలన నీకీ దుఃఖములన్నీ మరల మరల కలుగుచున్నవి" అని పలికెను. ఆ భగవంతుని వాక్యములను విన్న వైశ్య సాధువు స్వామినిలా స్తుతించసాగెను. "హే ప్రభో! విశ్వమంతయును నీ మాయామోహితమై యున్నది. బ్రహ్మాదులు గూడా నిన్నుఁ బూర్తిగాఁ దెలియఁజాలరు. నేను మూఢుఁడను. నీ మాయావశవర్తి యైన నేనెంతట వాడను. ప్రభూ! నిన్నవశ్యము బూజింతును. ప్రసన్నుడవై నా వైభవమును, ధనమును నాకు తిరిగి యనుగ్రహింపుము. శరణాగతుడను". భక్తితో సాధువు సేసిన వేడుకోలును సత్యనారాయణస్వామి యాలకించి, యానందించి, వర్తకుఁడు గోరినవన్నీ తిరిగి ప్రసాదించి యంతర్హితుఁ డయ్యెను. వెంటనే నావనెక్కి చూడగా ధనమంతయును యథాప్రకారముగా నుండుటఁ జూచి "సత్యదేవుని కృప వలన నా వాంఛితము నెరవేరిన" దని సంతోషాంతరంగుఁడై సత్యదేవుని విధివిధానముగాఁ బూజించి ప్రసాదమును స్వీకరించి సంతోషమునందెను.

సాధువు యల్లునితోఁ గూడ తన నావలో ప్రయాణము జేసి రత్నపురి యొక్క సముద్రతీరమునకు జేరెను. అప్పుడు సాధువు తన యల్లునితో "అల్లుఁడా! మనము క్షేమముగా మన పట్టణమునకుఁ జేరుకొన్నాము. ఈ విషయమును మన కుటుంబమునకుఁ దెలియఁ జేయుటకు నొక దూతనుఁ బంపుదు" మని, తన ధనరక్షకుడైన వ్యక్తిని దూతగాఁ బంపెను. ఆ భటుఁడు నగరములోకిఁ బ్రవేశించి, యా సాధువు యొక్క భార్య లీలావతి వద్దకుఁ బోయి హితవాక్యములనుఁ బలికెను. "అమ్మా! మీ భర్త, యల్లుఁడు, బంధువులతోను, స్వజనులతోను ఊరి సమీపమునకు వచ్చియున్నారు" అని

తెలియఁజేసెను. దూత చెప్పిన వార్త వినిన యా ఇల్లాలు పరమ సంతోషముతో సత్యనారాయణ వ్రతమునుఁ జేసి, కూతురుతో "అమ్మాయీ! నేను మీ తండ్రిగారిని సందర్శించుటకై వెళ్ళుచున్నాను. నీవునూ శీఘ్రముగా రమ్ము" అని చెప్పి వెళ్ళెను. కళావతి తానును సత్యనారాయణ వ్రతమునుఁ జేసి, ఆ తొందరలో స్వామి ప్రసాదమును స్వీకరించకయే భర్తను చూచుటకై పయనమయ్యెను. అందుకు సత్యనారాయణ స్వామి కోపించి కళావతి యొక్క భర్తను నావలోని ధనముతో సహా సముద్రమునందు ముంచివైచెను. ఆ దృశ్యమును జూచిన కళావతి మిక్కిలి శోకముతో విలపించుచూ నేలపైఁ బడి మూర్ఛిల్లెను. అకస్మాత్తుగా నావ మునిగి పోవుటయును, కళావతి శోకించుటయును జూచిన యక్కడి వారందరూ భీతావహులై, దుఃఖా శ్చర్యములతోఁ జింతాక్రాంత మనస్కులైరి. లీలావతి కుమార్తె యొక్క స్థితినిఁ జూచి విహ్వలయై భర్తను సమీపించి దుఃఖముతో విలపించుచూ "మన యల్లుఁడు నావతో సహా కనపడకుండా పోవుటకుఁ గారణమేమి? ఏ దేవుని విలాసము వలన నిలా జరిగినదో తెలియకున్నది. సత్యదేవుని మహిమనుఁ దెలిసికొనుట మనకు శక్యమా!" యని పలికి బంధుజనులతోఁ బాటు తాను కూడా కుమార్తెను కౌగిలించుకొని రోదింపసాగెను.

కళావతి స్పృహను బొంది, భర్తను బోగొట్టుకొని తాను జీవింపఁజాలనని భర్త యొక్క పాదుకలను తీసికొని ప్రాణత్యాగమునకై సిద్ధపడెను. తన కుమార్తె యొక్క ప్రయత్నమును జూచి వర్తకుడు సాధువు, భార్యా బంధువులతో మిక్కిలి చింతాగ్రస్తుడై యిలా యనసాగెను. "ఇది నాభ్రాంతియా ? లేక సత్యదేవుని మాయాలీలయా? తెలిసికొనలేకున్నాను. నా విభవమునకుఁ దగినట్లుగా సత్యనారాయణ స్వామీ! నీ వ్రతమును జేయుదును" అని యందరియెదుటఁ బలికి స్వామికి మరల మరల దండప్రణామములు సేయసాగెను. దానితో సంతుష్టుఁడై భక్తవత్సలుఁడు, దీనపరిపాలకుఁడు ఐన సత్యనారాయణ స్వామి యిలా పలికెను. "నీ కుమార్తె నా ప్రసాదమును భుజించుట మరచి తన పతిని జూచు నిమిత్తమై వచ్చినది. అందువలననే యతడు యదృశ్యుడయ్యెను. ఇది సత్యము. నీ కుమార్తె తిరిగి యింటికి వెళ్ళి ప్రసాదముఁ దిని వచ్చినచో నామె భర్త నిశ్చయముగా కనుపించును."

ఆ భగవద్వాక్యములను విన్న కళావతి వెంటనే గృహమునకుఁ బోయి స్వామి ప్రసాదమును భక్తితో స్వీకరించి తిరిగి యక్కడకు వచ్చి చూడగా నామె భర్త పరివారముతోఁ గూడ కనుపించెను. ఆమె సంతోషమునుఁ బొంది తండ్రితో నింక యాలస్యము జేయక మన గృహమునకుఁ బోవుదమనెను. ఆమె మాటలు విని సాధువు సంతోషముతో, అక్కడనే తన జనులందరితోఁ గూడి సత్యనారాయణ వ్రతమును విధివిధానముగా నాచరించి, పిమ్మట తన ధనముతో, పరివారముతో స్వగృహము జేరెను. ఆపై సాధువు ప్రతి పౌర్ణమి, రవి సంక్రమణములందు క్రమము దప్పక జీవిత పర్యంతము సత్య నారాయణవ్రతము జేయుచూ నిహలోకసుఖములను బొంది, యంత్యమున సత్యలోకమును (వైకుంఠము) జేరెను.

ఇతి స్కాన్దపురాణే రేవాఖణ్డే సత్యనారాయణ వ్రతకథాయాం
చతుర్థోఽధ్యాయః సమాప్తః ।
*("శ్రీ రమాసహిత సత్యనారాయణస్వామినే నమః ।" యని చేతిలోని యక్షతలను ఆకుమీద ఉంచవలయును. ముందటి వలెనే పునః పూజను జేయవలయును.)*

## పంచమాధ్యాయము

*(వ్రతకర్తలు ఆకులోని యక్షతలను మరలా కుడి చేతిలోనికి తీసికొనవలయును)*
సూత మహాముని శౌనకాది మునులతో మరియొక వృత్తాంతమును దెలియఁ జేయుదును, యాలకింపుడనెను. "పూర్వము ప్రజాపాలనా తత్పరుఁడైన తుంగధ్వజుఁడను నొక మహారాజుండెను. అతడు సత్యదేవ ప్రసాదమును స్వీకరింపక నిర్లక్ష్యము జేసి యెట్లు దుఃఖముల ననుభవించెనో వినుడు. ఒకసారి యా మహారాజు వేట నిమిత్తమై యడవికి వెళ్ళి క్రూరమృగములను వేటాడి యలసి యొక వటవృక్షము మొదలువద్దకుఁ జేరి సత్యనారాయణ స్వామి పూజను జూసెను. అక్కడ కొంతమంది గోపాలకులు బంధుగణ సమేతులై భక్తియుక్తులతో సంతోషముగా సత్య నారాయణ వ్రతముఁ జేయుచుండిరి. రాజు దానిని గమనించియు దర్పము వహించి యక్కడకు వెళ్ళక, నమస్కరించేక మిన్నకుండెను. ఆ గోపాలకులు బ్రసాదమును రాజు యొక్క సన్నిధిలో నుంచి తిరిగి వెళ్ళి స్వామి ప్రసాదమునుఁ దృప్తిగా తినిరి. కాని రాజు యా ప్రసాదమును ముట్టనైనా

ముట్టకఁ ద్యజించెను. ఆ పిమ్మట రాజున కనేక దుఃఖములు సంప్రాప్తించెను. ఆ రాజు తన ధనధాన్యాదికములన్నిటిని నష్టపోవుటయే కాక తన నూర్గురు పుత్రులను గూడ పోగొట్టుకొనెను. సత్యదేవుని ప్రసాదమును ద్యజించుట వలననే యీ వినాశము సంభవించినదని నిశ్చయించుకొని రాజు మరల ఆ ప్రదేశమునకు వెళ్ళి, యచేటి గోపాలురతోఁ గలసి మిక్కిలి భక్తి శ్రద్ధలతోఁ గల్పోక్తవిధిగా సత్యదేవుని వ్రతము నాచరించెను. అ పిమ్మట సత్యదేవుని యనుగ్రహము వలన మరల ధన పుత్రాదులనుఁ బొంది యిహలోకమందున సర్వసుఖముల ననుభవించి, యంత్యమున సత్యపురముఁ జేరెను.

ఎవరీ దుర్లభమైన సత్యవ్రతముఁ జేయుదురో, యెవరు పుణ్యప్రదము, భక్తి ముక్తిప్రదమైన వ్రత కథ నాలకింతురో వారికి సత్యదేవుని ప్రసాదము వలన ధనధాన్యాది సంపత్తులు గలుఁగును. దరిద్రుఁడు ధనవంతుఁడగును. బంధింపబడిన వాఁడు బంధవిముక్తుఁ డగును. భయావహుఁ డభయ మొందును. ఇది సత్యము మరియు నిశ్చయము. ఓ మునులారా! ఈ వ్రతము నాచరించిన వారు కోరిన కోరికల ననుభవించి మరణానంతరమున వైకుణ్ఠము జేరెదరు. సత్యవ్రతముఁ జేసిన మానవుఁడు సర్వదుఃఖ విముక్తుఁడగును. కలియుగమున నీ వ్రతము విశేష ఫలప్రదాయకము. ఈ దేవుని కొందరు సత్యేశుఁడని, కొందరు సత్యనారాయణుఁడని, మరికొందరు సత్యదేవుఁడనియునుఁ బిలుతురు. సనాతనుఁడైన శ్రీ మహావిష్ణువు నానారూపములను ధరించి భక్తులు గోరిన కోర్కెలను తీర్చును. కలి యుగమున సత్యనారాయణ స్వామిగా ప్రసిద్ధ దైవమగును.

[పాఠాంతరము: పై కథలయందు గల సత్యదేవుని భక్తుఁడైన బీద బ్రాహ్మణుఁడు దరువాయి జన్మములోఁ గుచేలుఁడను నామాంతరము గల సుదాముఁడను బ్రాహ్మణోత్తమునిగా జన్మించి, శ్రీ కృష్ణుని సఖుఁడై సర్వ సౌఖ్యములను, మోక్షమును బొందెను. కట్టెలమ్ముకొను భిల్లుఁడు దరువాయి జన్మమందున గుహుఁడై శ్రీరామ సేవారక్తుఁడై మోక్షమునందెను. ఉల్కాముఖ రాజు దశరథ మహారాజుగా జన్మించి శ్రీ రంగనాథుఁడైన మహావిష్ణుని సేవించి వైకుంఠప్రాప్తి నందెను. వర్తకుఁడైన సాధువు ద్వాపరయుగములో మయూరధ్వజుఁడను మహారాజుగా జన్మించెను. శ్రీ కృష్ణునిచే నర్జునుని

మించిన మహాభక్తునిగా నిరూపింపబడి శ్రీకృష్ణకృపచే వైకుంఠమునందెను. తుంగధ్వజ మహారాజు స్వాయంభువ మనువుగా జన్మించి శాశ్వత కీర్తిని, వైకుణ్ఠప్రాప్తిని బొందెను.]

ఓ ముని శ్రేష్ఠులారా! ఈ సత్యనారాయణ వ్రత కథను బ్రతి నిత్యమును బఠించు వారు, వినువారు సత్యదేవుని యనుగ్రహము వలన సర్వపాప విముక్తులగుదురు.

ఇతి స్కాన్ద పురాణే రేవాఖణ్డే సత్యనారాయణ వ్రతకథాయాం పఞ్చమోఽ ధ్యాయః సమాప్తః ।

*("శ్రీ రమాసహిత సత్యనారాయణస్వామినే నమః ।" యని చేతిలోని యక్షతలను ఆకుమీద ఉంచేవలయును. ముందటి వలెనే పునః పూజను జేయవలయును.*

*నీరాజనానన్తరము కథాక్షతలను శిరము మీద ధరించేవలయును. బ్రహ్మగారిచే గాని, తమకన్న పెద్దవారిచే గాని కథాక్షతలను శిరమున వేయించుకొనుట సంప్రదాయము)*

*(ఈ ప్రకారము పంచమాధ్యాయ పర్యన్తము, కామ్య ఫల, మోక్షఫల, ప్రసాద మహాత్మ్యములను వివరించు కథలను బంధుజనులతో కూడి విని, యా తరువాత బ్రాహ్మణ, బంధు సమారాధనమును జేయవలయును. పిమ్మట యాఱవ యధ్యాయము మొదలు దొమ్మిదవ యధ్యాయము వరకుఁ గల కథలను పఠించుచూ, వినుచూ రాత్రిని గడుపవలయును. సమయమున్నచో ఆరు నుంచి తొమ్మిది యధ్యాయముల కథలను గూడ పంచమాధ్యాయము పిమ్మటనే కొనసాగించి వినవచ్చును)*

## షష్ఠాధ్యాయము

త్రేతాయుగములో దశరథమహారాజునకు బట్టపురాణి కౌసల్యయందు జన్మించిన శ్రీరామచంద్రుఁడు తన తండ్రి సత్యసంధతను నిలుపుటకై, తన పిన్ని కైకేయి కోరిక కారణముగా, తన ననుసరించి వచ్చిన తమ్ముఁడు లక్ష్మణుఁడు, భార్య సీతతో బదునాలుగేండ్ల వనవాసమునకై యరణ్యముల కేగెను. వనవాసము చివరికాలమున పంచవటి యనుచోట నాశ్రమవాసము సేయుచుండగా రావణుఁడను లంకాపరిపాలకుఁడైన రాక్షసపతి మాయో

పాయముచే సన్యాసి రూపమున సీత నపహరించెను. లక్ష్మణునితో గలసి సీతకొరకై పెదకుచు శ్రీరాముఁడు, సీత నపహరించుకొని పోవుచున్న రావణునితో బోరాడి యవసాన దశలోనున్న జటాయువను పక్షిసత్తముని గలసి రావణుని సీతాపహరణ వృత్తాంతమును దెలిసికొనెను. పిమ్మట మార్గమధ్యమున కబన్ధుఁడను రాక్షసుని సంహరించెను. తరువాత సుగ్రీవుఁడను వానరరాజుతో స్నేహము జేసెను. అతని విరోధి సోదరుఁడగు వాలిని బరిమార్చి, సుగ్రీవుని గిష్కింధకు రాజును జేసెను. సుగ్రీవుని మంత్రిగా నున్న హనుమంతుఁడను కపిశ్రేష్ఠుఁడు రామునికి బరమభక్తుఁడు మఱియు నమ్మిన బంటయ్యెను. సీతను గనుఁగొను నిమిత్తమై నాలుగు దిక్కులకును బంపఁబడిన వానర సైన్యములో దక్షిణదిక్కునకు పెళ్ళివచ్చిన హనుమంతుని వలన సీత జాడను దెలిసికొనిన రాముఁ డపార వానర సైన్య సమేతుఁడై దిక్షిణదిశను గల సముద్ర తీరమును జేరెను.

దాటనశక్యముగా గనుపించిన సముద్రమును జూచి తమ్ముఁడు లక్ష్మణునితో "సౌమిత్రీ! ఏ పుణ్యము జేసిన నీ సముద్రమును దాటతరమగును?" అని చింతాగ్రస్తుడయ్యెను. వినిన లక్ష్మణుఁడు "నీపే యాదిదేవుఁడవు, పురాణ పురుషుఁడవు! నీకు దెలియనిది యున్నదా! ఇక్కడికి రెండు క్రోసుల దూరములో బకదాల్భ్యుఁడను మహర్షి యొక్క యాశ్రమమున్నది. ఆయన యనేక కల్పములను, అనేక రామావతారముల సెఱిఁగిన ప్రాచీనుఁడు. ఆయన నడుగుదము." లక్ష్మణుని మాట ననుసరించి, రాముఁడు బకదాల్భ్యమునిని సందర్శించి తాము లంకాపట్టణమును జయించుటకై సేనతో సముద్రతీరమునకు వచ్చియుంటిమని, సముద్రమును దాటుటకు దగిన యుపాయమును దెలిసికొను నిమిత్త మాయన వద్దకు వచ్చితిమని, మార్గమును దెలియఁజేసి యనుగ్రహింపమని యర్థించెను.

దానికి బకదాల్భ్యముని యాదరముతో శ్రీరామున కీ విధముగా ప్రత్యుత్తర మిచ్చెను. "ఓ రామా! వినుము. సర్వదుఃఖ వినాశకరమైన వ్రతమొకటి యున్నది. దాని నేకాగ్రచిత్తముతో నాచరించుము. సత్యనారాయణ స్వరూపుఁడైన విష్ణు వన్ని కోరికలను దీర్చు దేవుఁడు. ఆయనను బూజించినచో, రామా! నీకు దప్పక జయము గలుగును. నిస్సంశయముగా

సముద్రమును దాటశక్యమగును. లక్ష్మణ సహితుఁడవై యీ వ్రతమును విధివిధానముగా నాచరింపుము.

సఙ్క్రాన్తి దినమున, బంగారము లేదా వెండి లేదా రాగి లేదా మట్టితోనైనను జేసిన యొక కలశమును జల పల్లవ సహితముగా స్థాపించి దానిపై సువర్ణ మూర్తియైన సత్యనారాయణ ప్రతిమను బ్రతిష్ఠించే వలయును. ఆ కలశమును దానిమ్మ, కొబ్బరికాయలతో నలంకరించి కలశమునకు క్రిందున నవధాన్యములతో మంటపము సేర్పరుపవలయును. కలశమందున నవరత్నములనుంచి రెండు వస్త్రములతో గలశమును జుట్టి సత్యదేవుని ప్రాణప్రతిష్ఠను జేయవలయును. పిమ్మట గన్ధ, పుష్ప, ధూప, దీప, నైవేద్యములచే బూజించి వ్రత కథాశ్రవణమొనరించినచో కోరిన ఫలములు సిద్ధించును. రాత్రి నృత్య గానాదికములతో జాగరణమొనరించి ప్రాతః కాలమందున సూర్యోదయము తరువాత మరల సత్యదేవుని యథావిధిగా పూజించి, సత్యనారాయణ ప్రతిమను మరియు కలశమును బ్రాహ్మణునికి సమర్పించవలయును. శోడశ మహాదానములను జేయవలయును. ఆ విధముగా లక్ష్మణునితో కలసి తప్పక వ్రతమాచరింపుము. రామా! నీకు జయమగును." బకదాల్భ్యుని యుపదేశానుసారము రాముఁడు లక్ష్మణునితో గూడ వ్రతమును నాచరించి సఫలమనోరథుఁడయ్యెను. రావణుని నిర్జించి సీతాసమేతుఁడయ్యెను. ఆ విధముగా యీ సత్యనారాయణ వ్రతము నెవరు చేసి, కథను బఠింతురో, విందురో, వారికి నిశ్చయముగా విజయము గలుఁగును.

ఇతి షష్ఠోఽధ్యాయః సమాప్తః ।

## సప్తమాధ్యాయము

ద్వాపరయుగ ప్రారంభమున మాహిష్మతి పట్టణమున మహీజిత్తను రాజు రాజ్యపరిపాలనలో బ్రసిద్ధుఁడయ్యెను. పూర్వజన్మ పుణ్యార్జితమైన దీర్ఘా యుర్దాయమును బొంది చివరకు నొకనాడు తన దేహము జీర్ణావస్థకు లోనగుట గ్రహించి, సభామధ్యమున నీ విధముగా బలుకదొడఁగెను. "ఓ ప్రజలారా! ఈ జన్మమందున నేనేమియును పాతక కృత్యముల నొనరించేలేదు. బొక్కసము నన్యాయార్జిత ధనముతో నింపలేదు. బ్రాహ్మణ

ద్రవ్యమును బలాత్కారముగా తీసికొనలేదు. దండనార్హులే శిక్షింపబడిరి కాని యన్యులు కాదు. బ్రాహ్మణోత్తములారా! ఈ ప్రకారము కేవల ధర్మమార్గ చరితుఁడనై యున్న నాకు పుత్రసంతాన ప్రాప్తి లేకుండుటకు హేతు వెయ్యది?"

రాజు యొక్క పలుకులను వినిన సభాసదులు, ప్రజలతో, పురోహితులతో, మంత్రులతో కలసి రాజునకు హితమును జేకూర్చు ప్రయత్నమున నొక నిర్జనారణ్యమునకు వెళ్ళిరి. అక్కడ వారు నిరాహారుఁడు, క్రోధమును జయించినవాఁడు, సర్వశాస్త్ర విశారదుఁడు, సనాతనుఁడు, యనేక బ్రహ్మకల్పములను జూచిన ధర్మతత్వజ్ఞుఁడైన లోమశ మహామునిని గలసిరి. ఆ మహాత్మునికి యొక్కొక్క బ్రహ్మకల్పము గడచినంత యొక్కొక్క రోమము నశించుచుండును. అందుచేత ద్రికాలజ్ఞుఁడయిన యా మహాత్మునకు లోమశుఁడను బేరు గలిగినది. వారందరు ఆయనను చేరి సంతోషముతో నమస్కరించి వారివారికి దగినవిధముగా ఆశీనులై "మన రాజు యదృష్టమువలన నిట్టి మహాత్ముఁడు లభించినాడు" అని తలపోసిరి. లోమశుఁడు వారిని బరికించి "మీరేమి కోరి యిక్కడకు వచ్చి నన్నిలా సంతోషముతో స్తుతించుచున్నారు? నిస్సంశయముగా మీ మనోగతము సెఱుకపరచుడు. మావంటివారలకు బరోపకృతి తప్ప మరేమి ప్రయోజన ముండును?" అనెను. దానికి వారిలా బదులిచ్చిరి.

"మేము మాకున్న సంశయనివారణము నీ వలన గలుగునని వచ్చినాము. నీవు బ్రహ్మకన్నను బ్రాచీనుఁడవు. ఒక కార్యావసరము నిమిత్తమై వచ్చితిమి. మేము మహీజిత్తను రాజుచే బుత్రప్రేమతో బరిపాలింప బడుచున్న ప్రజలము. ఆయనకు సంతానము లేక చింతించుచున్నాడు. అపుత్ర దుఃఖితుఁడైన యా రాజునకు బుత్రప్రాప్తి కలుగుటకై మేమీ యరణ్యములో దపము జేయ వచ్చినాము. మహారాజు యొక్క పూర్వార్జిత పుణ్యముచేత బ్రాహ్మణ శ్రేష్ఠుఁడవైన నీ దర్శనము గలిగినది. మహాత్ముల దర్శనము వలన మానవులకు గార్యసిద్ధి కలుగుట సహజమే కదా! ఏమి జేసినయెడల మారాజునకు సంతానము గలుగునో దానిని మాకు నుపదేశించ గలరు". వినిన లోమశ మహర్షి కొంత తడవు ధ్యానము చేసెను. ధ్యానము వలన నా

రాజు యొక్క పూర్వజన్మ వృత్తాంతమంతయును దెలిసికొని యిలా యుత్తర మిచ్చెను. "ఓ జనులారా! మీ రాజు పూర్వ జన్మమున జాల దుర్వృత్తి కల దరిద్రుఁడైన వర్తకుఁడు. వాణిజ్యము నిమిత్తమై గ్రామగ్రామముల బడి తిరుగుచూ దప్పిక దీర్చుకొనుటకై నొక జ్యేష్ట శుక్ల ద్వాదశి తిథి రోజు మధ్యాహ్నమున నొక సరస్సు వద్దకు జేరెను. అదే సమయమున అప్పుడే ప్రసవించిన యొక గోవు దప్పిక దీర్చుకొనుటకై యా మడుగు వద్దకు వచ్చినది. ఎండలో సొలసినదై ఆబగా నీటిని ద్రావుచున్న యా గోవును నావతలికి దరిమి తాను నీటిని ద్రాగిన పాపఫలితముగా నపుత్రకుఁ డయ్యెను. అంతకు ముందటి జన్మములలో జేసిన పుణ్యఫలము వలన రాజయ్యెను."

ఆ వృత్తాంతమును విన్న జనులు "ఓ మునీశ్వరా! పుణ్య కర్మములు సేసినచో పాపము క్షయించునని పురాణోక్తి కదా! ఆ పాపక్షయమగుటకు దగిన పుణ్యోపదేశమును జేయుడు" అని వేఁడుకొనిరి. అప్పుడు లోమశముని "ఏకాగ్రచిత్తముతో సత్యనారాయణ వ్రతము నొనరించినచో వ్రత ప్రభావము వలన మీ రాజు పుత్రవంతుఁడగును. మీరా వ్రతమును నాచరించి, యా ఫలమును రాజునకు ధారపోయుడు" అనియెను. మునిశ్రేష్ఠుని వచనము లాలకించిన జను లాయనకు బ్రణమిల్లి, తమ పట్టణమునకు బోయి తత్క్షణమే రాజు కొరకై సత్యనారాయణ వ్రతము నాచరించి, యా పుణ్యఫలమును రాజున కర్పించిరి. ఆ పుణ్యఫలము వలన రాణి గర్భమును దాల్చి పుత్రునికి జన్మము నిచ్చెను. రాజునకు పుత్రప్రాప్తిని గలుగజేసిన వ్రతప్రభావమును దృష్టాంతముగ గ్రహించి యా ప్రజలు పూర్ణిమ, సంక్రాంతి మరియు నేకాదశి తిథులందున సత్యవ్రతమాచరించి, జన్మాంత్యమున వైకుంఠమును బొందిరి.

ఇతిః సప్తమోఽధ్యాయః సమాప్తాః ।

## అష్టమాధ్యాయము

సూతముని చెప్పుట బ్రారంభించెను "ఓ! శౌనకాది మహామునులారా! పాపౌఘనాశకరమైన మరియొక పావనమైన కథను చెప్పెదను. వినుడు.

ఒకప్పుడు కౌశికీ నదీతీరమందున దుష్టబుద్ధి యని పిలువబడు కఠిన చిత్తుఁడు, గుణహీనుఁడైన మానవాధముఁ డొకడుండెను. విద్యాహీనుఁడు, దరిద్రుఁడు అయిన యా మూఢుఁడు, ఏదోవిధమున ధనమును సంపాదించు నుపాయమును మాత్రము దెలిసినవాడై నిత్యము తిరుగుచూ యుండెడివాడు. రెండుకోటుల ధనము నన్యాయార్జితముగా పొందిననూ, దాన ధర్మాసక్తి లేక మరింతగా ధనమును సంపాదించు యావ గలిగి యుండెను. "మూఢులు, యపండితులు లోకములో దైవారాధనము సేయు చున్నారు. సత్యనారాయణుని పూజించుట యాశ్చర్యము. అందరునూ బుద్ధిహీనులై ద్రవ్యమును వృథ చేయుచున్నారు! దేవతారాధనము వలన ధనప్రాప్తి యెట్లు గలుగును? అటులయినచో లోకములో నందరూ ధనవంతులే కావలసినది కదా! నే నేదేవుని బూజించుట వలన ధనవంతుఁడ నైతిని? కాదు, నీచేత సత్యనారాయణ మూర్తి పూజింపబడెను. అందువలన నీవు ధనవంతుఁడవైతివని యనినచో, ఆ సత్యనారాయణ మూర్తి నా ద్రవ్యమును నశింపఁజేసినచో ఆయన మహాత్మ్యమును పరిగణింతును", అనుచూ యనునిత్యమును సత్యదేవుని హేళన చేయుచుండెను.

అట్టి సమయమున వాణిజ్య నిమిత్తము దేశాంతరమునకు వెళ్ళవలయునను తలంపు యా దుష్టబుద్ధికి గలిగినది. మనస్సున నిశ్చయించుకొని, యనేక రత్నరాశులను బరువుమోయగల యెడ్లబండ్లమీద నింపుకొని దేశాంతరము లందున వర్తకము చేసి విస్తారమయిన ధనలాభమును గడించి పరమా నందము బొందెను. ఆ దేశాంతరముల దిరుగు కాలమందు నొకచోట శౌచము, జ్ఞానము గల యొక బ్రాహ్మణుఁడు సత్యవ్రతము జేసెను. అహ్వానింపబడిన వారందరును పారమార్థిక బుద్ధితో నా వ్రతమును జూచుటకై వచ్చిరి. ప్రార్థనా పూర్వకముగా పిలుబడియు దుష్టబుద్ధి వ్రతమునకు వెళ్ళలేదు సరికదా, సత్యదేవుని వ్రతమును గుఱించి హేళన చేయసాగెను. దరిద్రుడైన బ్రాహ్మణుడు సిగ్గువిడచి ధనవంతుడనైన నన్నునూ పిలిచినాడు. ఏమి కాలమహిమ!" యని నిందించెను.

ఆ తరువాత సంపాదించిన ధనమును దీసికొని తన రక్షకులతో స్వదేశమునకు బ్రయాణమయ్యెను. మార్గమధ్యమందున్న యడవియందు,

కొందరు చోరులా ధనమును జూచి పరిజనులను కొట్టి ధనమును సంగ్రహించిరి. దుష్టబుద్ధి మెడను కాళ్ళకు గలిపి బంధించి, బాగుగా కొట్టి పడపైచి వచ్చిన త్రోవనే వెళ్ళిపోయిరి. ధనమంతయును బోగొట్టుకొని యొంటరిగా నా యరణ్యమందు మిగిలిన దుష్టబుద్ధి, యిది యంతయును తాను సత్యనారాయణ వ్రతమును జూడ తిరస్కరించిన కారణమున సంభవించిన ఫలముగా నిశ్చయించుకొని, యీ విధముగా శపథము జేసెను. "ఓ మాధవా! యెప్పుడు నా సేన, సంపత్తు నాకు దిరిగి లభించునో యప్పుడు నా సంపత్తుకు దగిన విధముగా సత్యనారాయణ వ్రతము జేయుదును". ఆ ప్రార్థనను మన్నించిన సత్యనారాయణ స్వామి యా దొంగల కాళ్ళను స్తంభింపఁజేసెను. కాళ్ళలో గదలిక యెందువలన నశించినదని చింతించుచూ, ఆ దొంగలు ధనము గల పెట్టెలలోకి జూచిరి. ఆశ్చర్యముగా పెట్టెలోని ధనమంతయు నదృశ్యమై యందు బుస కొట్టుచున్న సర్పములు, వృశ్చికములు గనబడెను. "మనోవాక్కులకు అర్థము గాని యీ మహిమ యేమిటి, యెవరిది యని యాలోచించి యిది యంతయును దాము ధనము గొల్లగొట్టిన ధన యజమాని దుష్టబుద్ధి యొక్క సామర్థ్యమై యుండునని యెంచిరి. ఈ దుష్టబుద్ధి యిన్ద్రజాల విద్యలందు నారితేరినవాఁడని యిదివరలో వినియున్నాము. అహో! ధనము సంగతి దేవుడెఱుఁగును. ముందు ప్రాణములు పోవునట్లున్నవి. ప్రాణము లున్న ధనమును మరల సంపాదించుకొనవచ్చును." అని తలచినవారై కొల్లగొట్టిన ధనమునంతయును నా దుష్టబుద్ధికి దిరిగి యిచ్చివేసిరి. తన ధనమును దిరిగి పొందిన దుష్టబుద్ధి మనమున గుదుటబడి, యా యరణ్యమందుననే భక్తితో సత్యవ్రతము నాచరించెను.

తరువాత ధనము నంతయు సెడ్లబండ్ల మీద వేసికొని తన గ్రామమునకు బ్రయాణము సాగించెను. మార్గమధ్యమందొక పెద్ద నదిని దాఁటవలసివచ్చి, దుష్టబుద్ధి తన ధనమునంతయు నొక నావలో జేర్చి తాను పరిజనులతో గూడ నావ సెక్కి, ప్రయాణము మొదలు పెట్టఁబోయెను. అప్పుడు సత్యదేవుఁడు దుష్టబుద్ధి యంతరంగమును మరల పరీక్షింపనెంచి, యొక ముదుసలి బ్రాహ్మణ వేషమును ధరించి దుష్టబుద్ధిని జేరి నమ్రతతో

నిట్లర్థించెను. "నేనొక దరిద్రుఁడనైన బ్రాహ్మణుఁడను. సత్యనారాయణ వ్రతము జేయవలయునను కోరిక కలిగినది. నీకు తోచినయంత ధనము నీయుము. నీ విచ్చే ధనముతో నాకు సంతుష్టి కలుగునో లేదో యని గాని లేదా నే నాధనముతో వ్రతము జేయుదునో లేదో యని గాని సందేహ పడకుము. నీవిచ్చిన దానితోనే సంతోషించి దానితోనే సత్యనారాయణ వ్రతము నొనరింతును. నీవిచ్చే ధనముతో నేను చేయు సత్యవ్రతము వలన భగవంతుడు నీకును శ్రేయము ననుగ్రహించును". అది వినిన దుష్టబుద్ధి యా బ్రాహ్మణునితో "నా వద్ద ధనమేమియును లేదు. పో పో" మ్మని పరిహసించెను. అది వినిన విప్రుఁడు "ఇప్పుడే కదా, నేను చూచుచుండగా బండ్లమీది నుండి ధనమును నావలోకి మార్చి ప్రయాణమునకు సమకట్టితివి! ఉంచుకొని లేదనుట నీ వంటి ధనవంతునకు దగదు. దేశకాలపాత్ర యోగ్యముగా చేయు దానము అక్షయమైన ఫలము నిచ్చును. నేను ధనదానము బరిగ్రహించుట కర్హుడనైన దరిద్ర బ్రాహ్మణుఁడను. ఈ రోజు ఉత్తమమైన పూర్ణిమా తిథి యగుటచే యోగ్యమైన కాలము. నీ విచ్చిన ధనముతో నేను వ్రతమునే చేయుదును. నాకు కొంచెమిచ్చినను చాలును, సంతోషమే! ఒక రూకనో, యందున సగమునో లేదా పావునో యిమ్ము. లేదనిన నేను మరియొకరిని యాచింతును. నీకు మంగళమగు గాక"యని పలికెను. వినిన మత్తుడైన దుష్టబుద్ధి "ధనమును హరించుటకు వచ్చితివా!" యని కఠినముగా వేళాకోళముగా పలికెను. మర్మభేదకమైన యా నిష్ఠురమైన పలుకులను వినిన సత్యనారాయణ ప్రభువు "ఓ మూఢా! నీవు శీఘ్రమే కష్టముల పాలౌదువు గాక!" యని కఠినమగు శాపమునిచ్చి, చాటునకు అంతర్హితుడయ్యెను.

అలా శాపము నిచ్చి బ్రాహ్మణుఁడు వెళ్ళిన యంతనే దుష్టబుద్ధి యెక్కిన పడవ నీటిలో మునిఁగిపోయెను. దుష్టబుద్ధి మాత్ర మొక వెదురుగడ సాయముతో మునుఁగుచు ద్రేలుచూ ఎట్లో యొడ్డునకు జేరఁగలిగెను. ఆ నది యొడ్డునే విలపించి విలపించి, తెలివిఁదప్పి, మరల స్పృహ వచ్చిన పిమ్మట "నా ధనము, బలము సర్వము నావతో పాటే నదిలో మునిఁగి నశించినవి. నేనొక్కడనే మిగిలియున్నాను. అయ్యో! నాకేమి గతి?" యని

విచారించెను. "ఈ ప్రపంచములో ధనమున్నప్పుడే భార్యాపుత్రులు గౌరవింతురు. ఆ ధనమును గోల్పోయిన నేను గృహమును జేరి మాత్రమేమి సుఖింతును? ఎవరికీ పట్టెడన్నము నేనాడూ పెట్టక, యుప్పుకూడా లేని గంజిని త్రాగి, కష్టపడి శ్రమకోర్చి సంపాదించిన ధనమంతయు నిప్పుడు దైవము బ్రతికూలించి నశించినది." అని చేతులతో దలను బాదుకొనుచూ మిక్కిలి రోదించుచూ మూర్ఛనంది మరలా స్మృతిని బొంది యిలా తలచెను. "నేనిప్పుడే యీ జలమునందు దూకి మరణించెదను. ధనము లేక భార్యా గృహము లుండినను బ్రయోజనమేమి? ధన హీనుఁడనై, మానహీనుఁడనై యింటికి బోయి చేయునదేమి యున్నది?" ఇంతలో నతనికి యొక సంగతి మదిలో మెదలెను. "యాచించిన బ్రాహ్మణుని నే నవమానించితిని. అందు వలననే యిట్టి దుఃఖము గలిగినది. ఆ వచ్చినవాడు విప్రవేషధారియైన సత్యనారాయణ మూర్తియో, బ్రహ్మయో లేక శివుడో యయి యుండ వలయును. కాఁబట్టియే పలికిన వెంటనే యది నిజమయినది! కాకున్న ఆ బ్రాహ్మణున కింత కష్టమును గలుగఁజేయు సామర్థ్యమెక్కడిది? కనుక ఆ బ్రాహ్మణునే శరణువేడి వాంఛితార్థములను బొందెదను గాక. నీ సన్నిధిలో నేను చేసిన యపచారమును మన్నింపుము." అని మనమున దలపోయుచు మిక్కిలి దుఃఖమును బొందెను.

ఆ వెంటనే, యంతర్హితుడైన యా విప్రుఁడు నవ్వుచూ దుష్టబుద్ధి యెదుట బ్రత్యక్షమై యిట్లు హితబోధ జేసెను. "ఓ దుష్టబుద్ధీ! నీవు నన్ను బూజించక యవమానించుటచే నీకీ యాపద వాటిల్లినది. శీఘ్రమే నీ యింటికి బోయి నా వ్రతమును జరుపుము. నన్ను కరుణాసముద్రుడనైన సత్యనారాయణ మూర్తిగా తెలిసికొనుము. నీ యంతరంగము బరీక్షింపనెంచి యజ్ఞాత బ్రాహ్మణునిగా వచ్చినాను. దీని కంతయును నేనే కారణము. నా మహాత్మ్య మును దెలిసికొనలేక యిలా యాపదల పాలయితివి." ఆ భగవానుని వాక్యముల నాలకించిన దుష్టబుద్ధి మిక్కిలి సంతోషముతో భగవంతుని స్తోత్రము జేయగా, నతని నావ సర్వసంపదలతో యథావిధిగా నీటిపైకి దేలినది. దుష్టబుద్ధి తన ధనమును, బలగమును దీసికొని నావలో నదిని దాటి తన గృహమును జేరి యత్యంత సంతోషముతో సత్యనారాయణ

వ్రతము నాచరించెను. అదిమొదలు బ్రతి మాసములో బ్రతి పక్షమునందు నానందముతో భక్తితో వ్రతమును జేసెను. కాలక్రమమున నందరూ యతనిని సుబుద్ధి యని పిలువసాగిరి. భార్యా బిడ్డలతో ధనసమృద్ధితో నారోగ్యముగా నూరు సంవత్సరములు సకల సుఖముల ననుభవించి మరణానంతరము స్వర్గమును జేరి, చేసిన పుణ్యఫలము వలన మునులతో, దేవతాస్త్రీలతో సేవింపబడుచూ దేవేంద్రభోగముల ననుభవించెను.

ఇతి అష్టమోఽధ్యాయః సమాప్తః ।

## నవమాధ్యాయము

సూతముని చెప్పఁదొడగెను.

చెప్పువారలకు, వినువారలకు సమస్త పాపనాశమును గలిగించెడి సత్య నారాయణ ప్రభువు యొక్క మరియొక కథామహాత్మ్యమును వినుడు. భూతలములో సమస్త సంపదలకు, సకల మంగళములకు నిలయమైన "అవంతి" యను నొక పట్టణమున్నది. ఆశ్రమాచారవర్తులైన బ్రాహ్మణులకు, నీతిశాస్త్రవర్తులైన క్షత్రియులకు, కుబేరతుల్య సంపన్నులైన వైశ్యులకు, చిత్తశుద్ధియు, సత్ప్రవర్తనము గలిగిన బుద్ధిమంతులైన యితర ప్రజలకు నునికిపట్టైన యా పట్టణములో 'కౌముది' యను పేరుగల యొక పతివ్రత కలదు. ఒక వణికుని కుమార్తెయైన యామె, పేరుకు దగినట్లుగా యాహ్లాద స్వభావముతో, బుణ్యశీలయై, దయాస్వభావియై, హరిహర పూజాతత్పరురాలై, సుశీలవతియై, తల్లిఁదండ్రులు సోదరు లెవ్వరునూ లేనిదై, యపనిందలకు గురికాకుండా పవిత్రురాలై కాలము గడుపుచున్నది. పూర్వజన్మకృత పాపఫలముగా బాల్యవితంతువై, యత్తమామలు, భర్తసోదరులు గూడా యెవ్వరును లేనిదై యుండెను. ఆ విధముగా నొంటరిదైనను, సాధ్వి, పుణ్యవతి, పతివ్రత, సద్గుణవతి యని లోకులందరిచే గొనియాడబడు సత్ప్రవర్తనము గలదై యుండెను. ఆ పట్టణములోని కొంతమంది పుణ్యాత్ములు, మహనీయులు దాము సత్యనారాయణ వ్రతమును జేసికొనుటయే కాక నితరులతో నాచరింపఁజేసి, వాంఛితార్థసిద్ధిని బడయుచుండిరి. ఆ పట్టణమున నొక సంతానహీను రాలైన బ్రాహ్మణవనితకు సత్యనారాయణ వ్రతమును జేయగా పుత్ర

సంతానము గలిగినది. ఆ వృత్తాంతమును వినిన యొక నిస్సంతువైన వైశ్యపత్ని తనకు గూడ యట్లే సంతానమును బ్రసాదించినచో తన యైశ్వర్యమునకు దీటుగా వ్రతమును జేయుదునని మ్రొక్కినది. అంతేకాక తన సమీపమున నున్న కౌముది యను నీ విశ్వస్తయౌ వైశ్యపత్నిని గూడ అట్లు మ్రొక్కుకొటకై పరిహాసపూర్వకముగా ప్రోత్సహించినది. కౌముదియును అట్లే పరిహాసపూర్వకముగా ప్రార్థించినది. అయితే యా పరిహాసపూర్వక ప్రార్థనమునకే సంతుష్టుడైన సత్యనారాయణ ప్రభువు స్వప్నమందే యా కౌముదితో సంగమించెను.

కౌముది యుదయమునసే మేల్కాంచి, యా స్వప్నవృత్తాంతము దలచి, "యిది యేమి! మిక్కిలి యాశ్చర్యమును, భీతిని గలిగించుచున్నది. ఈ స్వప్నచర్యచే నాకు నిజముగా సంతానము గలిగినచో నాగతి యేమగును? దైవికమగు నీ ఫలితము వలన బరలోకమును గుఱించి నాకు భయము లేదు, కాని యిహలోకమున భయము కలుగఁగలదు. ఓ రమాపతీ! అనాథనైన యేకాకిని. ఈ యపవాద సముద్రమును దాట నశక్తురాలను. స్థిరమైన యీ యపవాద భారమును మోయుచూ యస్థిరమైన యీ శరీరము నేల కాపాడుకొన వలయును? అందువలన విషపానముచే మరణించెద" నని నిశ్చయించుకొని, యెటులో విషమును సంపాదించి, త్రావబోవగా విష్ణుమాయారూపమైన నిద్ర యామెనావహించెను. ఆ విషపాత్రయును సత్యనారాయణమూర్తి మహిమచే నపహరింపబడెను. ఆమె మేల్కాంచి మిక్కిలి దుఃఖము బొందెను. ఆ పిదప ననేక పర్యాయము లామె యాత్మహత్యా ప్రయత్నముల నెన్ని జేసినను, సత్యనారాయణమూర్తి వాటిని విఘ్నమొనరించెను. మరణప్రయత్నము లన్నియు నిష్ఫలమగుట జూసి యామె యిట్లు దలపోసెను. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్". జన్మాన్తర కర్మఫలమును శుభమైనా, యశుభమైనా యనుభవించేక దప్పదు. చేసిన పాపము నూరుకోట్ల కల్పముల తరువాతైనను క్షీణింపదు, క్షయింపదు. హరిహర బ్రహ్మాదులైనను నుదిటి వ్రాతను మార్చగాలేరు! ఏమి కానున్న నది జరుగునని శాస్త్ర వివేచనము జేసి మిన్నకుండెను.

క్రమముగా ఆమెలో గర్భిణీ లక్షణములు బొటమరించినవి. ఒకరినుంచి యొకరికి నీ వార్త ప్రాకిపోయెను. కొంతమంది విని చెవులు మూసికొని వెళ్ళుచుండిరి. కొందరు స్త్రీలు నమ్మక, "ఆమె ధృడమైన పతివ్రత, యామె యందట్టి విషయము సత్యము గానేర" దనుకొనిరి. జనులిట్లు దలఁచు చుండగా, ఆమెయందు గర్భచిహ్నములు స్ఫుటముగా గోచరించినవి. జనులు గొంతతడవు విచారించి చివరకు తూష్ణీభావము వహించిరి. అలా తొమ్మిది మాసములు నిండిన బిమ్మటఁ బదియవ మాసమునఁ గౌముది యొకనాటి మధ్యాహ్నమున వేయిసూర్యుల వంటి వర్చస్సును, మన్మథుని బోలు సౌందర్యమును గలిగిన వందనీయుఁడైన పుత్రునిఁ బ్రసవించినది. దేవదుందుభులు మ్రోగినవి. పుష్పవృష్టి కురిసినది. సత్పురుషుల మనస్సునందు నా బాలుని యెడఁ బ్రీతి కలిగినది. తల్లి, యైదవ సంవత్సరమున నా బిడ్డకు నొక గురువుతో నక్షరాభ్యాసమును జేయించినది. ఆ బిడ్డ యేకసంత గ్రాహియై గురువాత్సల్యమునుఁ బొంది, సర్వవిద్యా విశారదుఁడయ్యెను. కరుణామూర్తియై గురువుతో సమానమైన వాడిగా రూపొందెను. ఇది చూచి సజ్జనులు హర్షించిరి.

కాని, కొందరు దుర్జనులు బరమఘాతుకమైన యసూయాభావమును బెంచుకొని యా పిల్లవానితో "నీవు రండాపుత్రుఁడవు. నీ తండ్రి మరణా నంతరము జన్మించినావు. నీ తండ్రి యెవరో తెలియదు. తెలిసినచో నతని పేరు జెప్పుము. తెలియెనిచో నధముఁడపై తలదించుకొని పొమ్ము" నుచుఁ గేలి చేయసాగిరి. ఆ పలుకులకు మనమున రోషము, నాశ్చర్యము గలిగినను, నా బాలకుఁడు గోపమునుఁ గనుపరుపక శాంతుఁడై యుండెను. అతఁడు గవ్వలాట మొదలగు క్రీడలయందుఁ జతురుఁడు. నానాశాస్త్రము లందుఁ బ్రసంగములను జేసి సభాజయములనుఁ బొందెను. ముష్టియుద్ధము లందున భీమునివలె నితర మల్లులకు భయమునుఁ గలిగించెడివాడు. ఈర్ష్యాళువులై దుష్టులా బాలకునిఁ జంప యత్నించిరి. అతని పాదములనుఁ గట్టి నదిలోఁ బడవైచిరి. కాని యతఁడు బంధనములనుఁ ద్రెంచుకొని బయటకు రాగలిగెను. విషమును బెట్టిరి. బల్లెములచేఁ బొడిచిరి. దావానలములోకిఁ ద్రోసిరి. ఆ పిల్లవానిచే విద్యలయందు నపజయము

బొందిన వారీ రీతిగ ననేక ఘాతుకకర్మలచే నతనిని బీడించిననూ యపాయముల నుంచి బయటపడెను. పాపులచేఁ జేయబడు గర్మము దుష్టబుద్ధి కల మనుజుని వలె నిష్ప్రయోజనము. ఆ పట్టణమందుఁ గల కొంతమంది దుష్ట ప్రవృత్తినిఁ గలిగిన ప్రజలు గౌముదిని రంకులాడి యనియు, సిగ్గు విడచినది, కులట యని ప్రతి దినమును హేళన చేయుచుండిరి. ఆ కుర్రవాఁడు మాత్రము విద్యావంతుఁడు, సుగుణ వంతుఁడు, బలవంతుఁడు, యఱువది కళలయందున బండితుఁడు, వర్తకమున నేర్పరియై యున్నను యీ రీతి నపకీర్తి పాలగుటను జూచి, కొంతమంది పండితులు పరిష్కారము కొరకు సభ నేర్పాటు చేసిరి.

ఆ సభలోఁ గొందరు యీ కౌముది మిక్కిలి గుణవంతురాలు. కుజనుల వలన నామెపై నీ నింద పడినది. లోకములో దైవానుగ్రహము వలన బిల్లలు గలిగిన దృష్టాంతములు పెక్కులు గలవు. కోలాహలుఁడను వ్యక్తి భార్యకు శివానుగ్రహమున జ్ఞానవంతుఁడైన పుత్రుఁడు గలుగుటను, కణికుఁడను వాఁడొక విధవకు శివానుగ్రహమునఁ బుట్టుటయును విని యున్నాము. ఆమె యందున నీ అపవాద మెట్లు నిలుచునని యడిగిరి. అప్పుడు నిర్గుణుఁడను వాడొకఁడు లేచి మీరందరును ధర్మపరులు, పరోపకారులు, సత్యవాదులు, యీర్ష్యాసూయలు లేనివారు. కాని నేనట్టివాఁడను గాను. యీ కౌముది నడవడిక వేశ్యతో సమానమైనది. దుష్టసంచరిత. దౌర్భాగ్యురాలు. ఈమె నిస్సందేహముగా పరిత్యజించదగినది. ఆమె పేరును దలఁచుటయును మహాపాపమనుచుఁ దనవంటి కొంతమందిని దన పక్షమునఁ జేర్చుకొని యామెపైనఁ గక్షనుఁ బెంచుకొని యుండెను. ఇట్లుండగా నొకనాడు నిర్గుణుఁడు దన స్వగృహమందున కమలాక్షియను పతివ్రతయైన తన భార్యనే చూసి, దాసి యని భ్రాంతిఁ జెంది, దానిఁ గొప్పుఁ బట్టి, "నా గృహమధ్యమందున నీవేల యుంటివి చెప్పు" మనుచూ కాలితోఁ దన్నుట మొదలిడెను. మంచి నడవడికను గలిగిన యా కమలాక్షియును భ్రాంతి చెంది, భర్తను ద్వారపాలకుఁడని యెంచి, చేతిలోని యంకుశముతో నతనినిఁ బొడిచినది. నీచకులమందున బుట్టిన నీవేల నా గృహమధ్యమున జేరితివని నిర్గుణుఁడు; యధముఁడవైన ద్వారపాలకుఁడవు, నీవు నన్నిలా

కఠినముగాఁ గొట్టెదవా యనుచు కమలాక్షియును, పరస్పరము గుఱుతించుకొన లేక, దుర్భాషలాడుకొనుచు, రకరకములుగా నొకరినొకరు కొట్టుకొనుచూ, తిట్టుకొనుచూ వీధులను బడిరి. అప్పుడా దంపతులను జూచి యూరిలోని జనులిలా తలపోసిరి. "ఏమి యాశ్చర్యము! కమలాక్షి సాధ్వి, పతిప్రియ. నిర్గుణుఁడును గ్రూరచిత్తుఁడైనను, లోకమున బ్రసిద్ధినిఁ బొందిన కీర్తిమంతుడు. వీరిరువురి మధ్యన నిట్లు జరుగవలసినది కాదు. ఏమి కారణమై యుండును? పూర్వ జన్మ దుష్కృత మిట్లు పరిణమించినది కాబోలు!".

పూర్వదినమున నిర్గుణుఁడు కౌముదిని గుఱించి యాడిన కఠిన వాక్యములను గుర్తుఁ జేసికొని, యామెనుఁ బిలిపించి, యిట్లనిరి. "అమ్మా! నీకు భయము లేదు. నీ కుమారుని గుఱించిన వాస్తవమును వివరించు" మనిరి. దానికా పతివ్రతయైన కౌముది, తాను తోటిస్త్రీ ప్రోద్బలముచే బరిహాసపూర్వకముగా సత్యనారాయణస్వామితోఁ బుత్రునిఁ బ్రసాదించినచో వ్రతమును చేయుదునని పలుకుటయును, సత్యనారాయణ స్వామి యనుగ్రహముచే గర్భవతి యగుటయును, యనేకానేక మరణ ప్రయత్నములనుఁ జేసియును విఫలమగుటయును, నా పిమ్మట కుమారుని జననమగుటయును దెలిపి, తదనంతరము జరిగినవన్నియును మీకు తెలిసినవే కదాయని, యంతకు మించి తనకు మరేమియునుఁ దెలియదని మిన్నకుండెను. జనులు కౌముది మాటలను విశ్వసించిరి. ఈ నిర్గుణుఁడును, కమలాక్షియును యథాపూర్వస్థితి బొందినచో యిప్పటికిప్పుడే సత్యనారాయణ వ్రతమును జేయింతుమని మ్రొక్కిరి. వెంటనే యా దంపతులునుఁ బూర్వస్థితినిఁ బొంది, యజ్ఞానముచే సెఱపిన దుష్ట వర్తనమునుఁ దలఁచుకొని, సిగ్గుతో తలలను వంచుకొని తమ గృహమును జేరిరి. అంతట గుమికూడిన జనులు, నిర్గుణుఁడా! శీఘ్రమే సత్యవ్రతము జేయుమనిరి. నిర్గుణుఁడు జనవాక్యమునుఁ బాటించి శ్రేష్ఠమైన రీతిగా వ్రతమును జేసెను. అంతటఁ గౌముదియును, నపవాదు తొలఁగినది కదా యని ధైర్యముగా తానునూ యందరి సమక్షములో సత్యనారాయణ వ్రతము నాచరించినది. అయితే కొందఱు నిర్గుణుని మాటల వలనఁ గలిగిన శంకచేఁ

బ్రసాదమును స్వీకరించుటకు సంశయింపసాగిరి. అప్పు డాకాశమునుంచి మహాద్భుతముగా "కౌముదిచేఁ జెప్పబడిన దంతయును నిజము. విశ్వసింపని వారి సమస్త సంపదలను హరింతును. ఈ విషయమై సందేహము వలదు" అను గంభీరమైన వాక్కులు వినఁబడెను. ఆ యాకాశవాణిని వినిన జనులు సంతోషమును బొందిరి. నిర్గుణుఁడును సంశయమును వీడి ప్రీతితో తన కుమార్తెను కౌముది కుమారున కిచ్చి వివాహముఁ జేసెను. కౌముది కొడుకు, కోడలితో సుఖమున నుండి యిహలోకములో సమస్తసుఖముల ననుభవించి, అంత్యమున వైకుంఠముఁ జేరెను. అక్కడొక కల్ప కాలముండి, పిమ్మట కైలాసమును జేరెను. అక్కడొక కల్పము గడచిన తరువాత బ్రహ్మ లోకమునందెను. అచట నొక కల్పకాలము భోగముల ననుభవించి తుదకు బ్రహ్మతో పాటు సాలోక్య ముక్తినిఁ బొందెను. ఈ కథను భక్తితో వినిన వారు యిహలోకసుఖముల ననుభవించి, పిమ్మట స్వర్గమును బొందెదరు. మూఢత్వముతో లోకప్రసిద్ధమైన నీ యధ్యాయమును నిందించినచో వారి స్వర్గలోకస్థితులైన పూర్వీకులును నరకగతులౌదురు.

ఇతి నవమోఽధ్యాయః సమాప్తః । ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః. స్వస్తి.

తూరుపు

ఈశాన
ఇంద్ర
అగ్ని

ఉత్తరము
కుబేర
గోవింద
అనంత
అచ్యుత

గౌరి
రుద్ర
లక్ష్మి
విష్ణు
సరస్వతి
బ్రహ్మ

ఊర్ధ్వ పురుష
మృత్యుం
అభయంకర
వాస్తు పురుష
క్షేత్రపాలక
గణపతి
దుర్గా
పృథ్వి

గౌరి
రుద్ర
విష్ణు
బ్రహ్మ
గణేశ

వరుణ కలశము
ప్రధాన కలశము, ప్రతిమ

యమ
దక్షిణము

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| అ.ప్ర. సహిత కేతు | అ.ప్ర. సహిత రాహు | అ.ప్ర. సహిత శని | అ.ప్ర. సహిత శుక్ర | అ.ప్ర. సహిత గురు | అ.ప్ర. సహిత బుధ | అ.ప్ర. సహిత కుజ | అ.ప్ర. సహిత చంద్ర | అ . ప్ర. సహిత రవి |

లేదా

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| అ | కే | ప్ర | అ | రా | ప్ర | అ | శ | ప్ర | అ | శు | ప్ర | అ | గు | ప్ర | అ | బు | ప్ర | అ | కు | ప్ర | అ | చం | ప్ర | అ | ర | ప్ర |

వాయు
వరుణ
నిర్ఋతి

నవగ్రహములన్నీ పశ్చిమముఖోద్యములు
పశ్చిమము

**సత్యనారాయణ వ్రత మంటపారాధన**

**గ్రహ మండల రూపములు**

**రవి:** ◯ **చంద్ర:** □ **కుజ:** ▷ **బుధ:** ⟶ **గురు:** ▭ **శుక్ర:** ☆

**శని:** **రాహు:** **కేతు:**

**నవగ్రహ మండల స్వరూపము**

**(అధిదేవా దక్షిణేతు వామే ప్రత్యధి దేవతా:)**




→ గుర్తు గ్రహ ముఖదిశను మఱియు కుడి వైపును సూచించును

(గురువును ధ్యాన శ్లోకము ప్రకారము తూర్పు ముఖునిగా చూపడమైనది. ఆచరణలో ఉత్తర ముఖునిగా చూపుట ప్రచారములో కలదు. ఆ సందర్భములో ధ్యానములో “ఉదంగ్ముఖ స్వభావః”, స్థాపనలో “ఉదంగ్ముఖం” అని చెప్పి బ్రహ్మణం ను గురువుకు తూర్పు దిశను, ఇంద్రుని గురువుకు పశ్చిమదిశ యందు ప్రతిష్టించవలసియుండును)

నవగ్రహ జనన వివరములు

| గ్రహము | (1) ఎక్కువ ప్రాచుర్యములో ఉన్నవి | (2) చల్లా వారి గ్రంథము | (3) భారతుల వారి గ్రంథము | (4) వావిళ్ళ వారి గ్రంథము |
|---|---|---|---|---|
| రవి | | | | |
| సంవత్సరము | ప్రభవ | ప్రభవ | ప్రభవ | ప్రభవ |
| మాసము | మాఘ | మాఘ | మాఘ | మాఘ |
| తిథి | శుక్ల ౭ | శుక్ల ౭ | కృష్ణ ౭ | కృష్ణ ౭ |
| నక్షత్రము | అశ్విని | కృత్తిక | విశాఖ | విశాఖ |
| చంద్ర | | | | |
| సంవత్సరము | సౌమ్య | సౌమ్య | నన్దన | నన్దన |
| మాసము | కార్తీక | కార్తీక | కార్తీక | కార్తీక |
| తిథి | శుక్ల ౧౫ | శుక్ల ౧౦ | శుక్ల ౧౫ | శుక్ల ౧౪ |
| నక్షత్రము | కృత్తిక | ఉ.భాద్ర | కృత్తిక | కృత్తిక |
| కుజ | | | | |
| సంవత్సరము | రాక్షస | రాక్షస | అక్షయ | అక్షయ |
| మాసము | ఆషాఢ | ఆషాఢ | శ్రావణ | వైశాఖ |
| తిథి | శుక్ల ౧౦ | శుక్ల ౧౪ | శుక్ల ౧౩ | కృష్ణ ౨ |
| నక్షత్రము | అనూరాధ | మృగశిర | పూ.షా | పుబ్బ (పూ.షా?) |
| బుధ | | | | |
| సంవత్సరము | ఆంగీరస | ఆంగీరస | సౌమ్య | సౌమ్య |
| మాసము | మార్గశిర | మార్గశిర | జ్యేష్ఠ | భాద్రపద |
| తిథి | శుక్ల ౭ | శుక్ల ౭ | కృష్ణ ౧౧ | శుక్ల ౧౧ |
| నక్షత్రము | పూర్వభాద్ర | పూర్వభాద్ర | భరణి | ఉ.ఫ (ఉ.షా?) |
| గురు | | | | |
| సంవత్సరము | ఆంగీరస | ధాత | ఆంగీరస | సౌమ్య |
| మాసము | వైశాఖ | వైశాఖ | వైశాఖ | ఆశ్వయుజ |
| తిథి | శుక్ల ౧౧ | కృష్ణ ౧౪ | శుక్ల ౧౧ | కృష్ణ(శుక్ల?) ౧౨ |
| నక్షత్రము | ఉ.ఫల్గుని | భరణి | ఉ. ఫల్గుని | ధనిష్ట |

# నవగ్రహ జనన వివరములు

| గ్రహము | (1) ఎక్కువ ప్రాచుర్యములో ఉన్నవి | (2) చల్లా వారి గ్రంథము | (3) భారతుల వారి గ్రంథము | (4) వావిళ్ళ వారి గ్రంథము |
|---|---|---|---|---|
| **శుక్ర** | | | | |
| సంవత్సరము | పార్థివ | పార్థివ | మన్మథ | మన్మథ |
| మాసము | శ్రావణ | శ్రావణ | చైత్ర | శ్రావణ |
| తిథి | శుక్ల ౮ | శుక్ల ౧౨ | శుక్ల ౧౧ | శుక్ల ౧౦ |
| నక్షత్రము | స్వాతి | జ్యేష్ఠ | మఖ | పుష్యమి |
| **శని** | | | | |
| సంవత్సరము | విభవ | ప్రమోదూత | విభవ | వికారి |
| మాసము | పుష్య | పుష్య | మాఘ | మార్గశిర |
| తిథి | శుక్ల ౯ | కృష్ణ ౮ | కృష్ణ ౧౪ | కృష్ణ ౯ |
| నక్షత్రము | భరణి | స్వాతి | ధనిష్ట | రోహిణి |
| **రాహు** | | | | |
| సంవత్సరము | రాక్షస | రాక్షస | ఫార్థివ | రాక్షస |
| మాసము | భాద్రపద | భాద్రపద | భాద్రపద | మాఘ |
| తిథి | కృష్ణ ౧౪ | కృష్ణ ౧౪ | శుక్ల ౧౫ | కృష్ణ (శుక్ల?) ౧౪ |
| నక్షత్రము | విశాఖ | హస్త | ఫూ.భాద్ర | ఆశ్రేష |
| వారము | భాను | భాను | శని* | శుక్ర |
| **కేతు** | *రాహు కేతువులకు స్థిర భౌమ వారములు గమనార్హము. "శనివ ద్రాహుః కుజవత్ కేతుః " | | | |
| సంవత్సరము | రాక్షస | రాక్షస | కీలక | పార్థివ |
| మాసము | చైత్ర | చైత్ర | మార్గశిర | ఫాల్గుణ |
| తిథి | కృష్ణ ౧౪ | కృష్ణ ౧౪ | కృష్ణ ౩౦ | శుక్ల ౧ |
| నక్షత్రము | రేవతి | రేవతి | మూల | అభిజిత్ |
| వారము | సోమ | సోమ | మంగళ* | బుధ |
| | **ప్రస్తుత గ్రంథములో యిచ్చినవి** | | | |
| మిగతా గ్రహములకు వారి పేరు గల వారములే చెప్పవలయును | | | | |

## ఆశీ:

ప్రముఖ న్యాయవాది, ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మాజీ మంత్రివర్యులు మరియు నిష్కళంక రాజకీయ వేత్తగా మన్ననలందిన కీ.శే. శ్రీ సింహాద్రి సత్యనారాయణరావు గారు (అవనిగడ్డ), వారి ధర్మపత్ని వేంకటరత్నమ్మ దంపతుల ఏకైక కుమారులు, "వైద్యో నారాయణో హరి:" అను ఆర్యోక్తికి నిదర్శనముగా వాసికెక్కిన సుప్రసిద్ధ కేన్సర్ శస్త్రచికిత్సా నిపుణులు **డా॥ సింహాద్రి చంద్రశేఖరరావు** గారు మరియు వారి ఆదర్శపత్ని ప్రముఖ ప్రసూతి చికిత్సా నిపుణులు **డా॥ శ్రీమతి నిర్మల** (సౌమ్య మల్టి స్పెషాలిటీ హాస్పిటల్, కార్ఖానా, సికింద్రాబాద్) గార్ల వదాన్యతతో, స్కన్ధత్రయ జ్యోతిష, వాస్తు విద్యావిశారదులైన బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ గారి గౌరవస్మృతికి గురుపురస్కృతిగా ఈ పొత్తము ముద్రింపబడుట కడు అభినందనీయము. శ్రీ శర్మ గారి ఆశీస్సులు వీరికి అనంత శుభావహమగు గాక !

భగవత్కార్యమును ఏ రూపముగా నిర్వహించిననూ స్వామికి ప్రీతిపాత్రమే యగును. శ్రీ స్వామివారి సంకల్పముతో, ఐచ్ఛికముగా, ఈ భగవత్సేవా కార్యభారమును వహించిన వారి కుటుంబమంతటినీ సర్వ జగన్నాథుడైన శ్రీ రమాసహిత సత్యనారాయణస్వామి సర్వదా, సర్వధా, సర్వథా తన కృపా కరుణేక్షణతో ఈప్సితార్థముల నిచ్చి కాపాడుచుండు గావుత! సమస్త సన్మంగళాని భవన్తు. ఇతి ఆశీ:

ముట్నూరి దుర్గానాగేశ్వర శాస్త్రి

## శతజయంతి సంస్మృతి



(కీ.శే. బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ సిద్ధాంతి గారు, ధర్మపత్ని రాజ్యలక్ష్మి)

"అద్వేషీ, నిత్యసంతోషీ, గణితాగమ పారగ: । ముహూర్త గుణదోషజ్ఞో వాగ్మీ కుశల బుద్ధిమాన్ । శాస్త్ర శ్చామృతవాక్సౌమ్య స్త్రికాలజ్ఞో జితేన్ద్రియ: । నిత్యకర్మరతో యోవైస దైవజ్ఞ: ప్రకీర్తిత: ॥ " అని శాస్త్రములో చెప్పబడిన దైవజ్ఞ లక్షణోపేతులైన బ్రహ్మశ్రీ కవితా కామేశ్వరశర్మ సిద్ధాంతి గారు (క్రీ.శే. 1916-1990) అవనిగడ్డ, కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్ వాస్తవ్యులు. ప్రసిద్ధ వాస్తు జ్యోతిష విద్వాంసులు. పంచాంగ కర్తలు. గొప్ప తపశ్శాలి. వేదాంగ జ్యోతిషమును ప్రాథమికముగా బందరులో బ్రహ్మశ్రీ చింతా సోమసుందరశర్మ జోస్యుల వారివద్ద, విశేషముగా పరాశరీయ, జైమినీయాది సిద్ధాంతాలను తెనాలిలో బ్రహ్మశ్రీ శ్రీధర వెంకయ్య గారు మఱియు వారి కుమారులైన బ్రహ్మశ్రీ శ్రీధర విశ్వనాథశాస్త్రి సిద్ధాంతి గారివద్ద అభ్యసించారు. సంస్కృత, హిందీ, ఆంగ్ల భాషాభినివేశముతో అనేక పూర్వ, సమకాలీన, ప్రాచ్య పాశ్చాత్య జ్యోతిష నిగూఢ సంప్రదాయాలను లోతుగా అధ్యయనము చేసిన శ్రీ శర్మ గారు గొప్ప యోగులు. తపోనిష్ఠులు. వాక్శుద్ధి సంపన్నులు. ప్రచారార్భాటాలకు అతి దూరంగా, అతి నిరాడంబరునిగా, ధనార్జన కాంక్ష లేకుండా జ్యోతిష శాస్త్రప్రయోజనాన్ని తన వద్దకు వచ్చినవారికి సంపూర్ణముగా కలుగజేసిన నిష్కల్మష లోకహితులు. నిర్గుణ పరబ్రహ్మోపాసనతో తరించిన మహనీయులు. వారి నివాసములో జంతువులు జాతి వైరము మరచి ప్రవర్తించెడివి! "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను ఆకళింపుతో జీవితాంతము మెలగిన ఆధ్యాత్మిక అద్వైతయోగి.